# ఐతరేయోపనిషత్తు

(ఆంధ్ర టీకా తాత్పర్య సహితము)



కళాప్రపూర్ణ పండిత గోపదేవ్



ప్రకాశకులు :

ఆర్య సమాజము - కూచిపూడి

తెనాలి తాలూక, గుంటూరు జిల్లా.

PIN 522 313.

# అంబా దర్శన గ్రంథమాల

మహారాజపోషకులు:- రూ.15,000లు అంతకుపైన నిచ్చువారు
రాజపోషకులు:- రూ.10,000లు అంతకుపైన నిచ్చువారు
పోషకులు:- రూ.5,000లు అంతకుపైన నిచ్చువారు

మహారాజపోషకులు:

| | | |
|---|---|---|
| 1. | శ్రీమతి కొత్తపల్లి యామినీదేవి | కూచిపూడి |
| 2. | శ్రీ బెల్దె జగదీశ్వరయ్యశ్రేష్ఠి | సికిందరాబాద్ |
| 3. | శ్రీ మాశెట్టి వేంకటేశ్వర రావు | సికిందరాబాద్ |
| 4. | శ్రీ కొసరాజు మాధవయ్య | తెనాలి |
| 5 | డా.శ్రీ వై.వి. సుబ్బారావు, సరోజినీదేవి | గుంటూరు |
| 6. | శ్రీ గ్రంధి కామరాజు | విజయవాడ |
| 7. | శ్రీ కావూరి జయచంద్రవర్మ | కూచిపూడి |
| 8. | శ్రీ చదలవాడ అచ్చేశ్వరరావు, రాజ్యలక్ష్మి | కూచిపూడి |
| 9. | శ్రీమతి చదలవాడ లక్ష్మమ్మ | కూచిపూడి |
| 10. | శ్రీ మత్తిరెడ్డి గురవారెడ్డి | తూములూరు |
| 11. | శ్రీ చంద్రయ్య & సన్సు-అలవాల | సికిందరాబాద్ |
| 12. | శ్రీ యం.యస్. బాలకృష్ణ, సుధాకర్ | సికిందరాబాద్ |
| 13. | శ్రీ ఉప్పల రాజేశ్వర రావు | సికిందరాబాద్ |
| 14. | శ్రీ కొసరాజు తిరుమలరావు, సూర్యకుమారి | కురుమద్దాలి |
| 15. | శ్రీ గత్తె సుబ్బారావుగుప్త, నాంచారమ్మ | గుంటూరు |
| 16. | శ్రీ జక్కిడి సీతారామరెడ్డి | సికిందరాబాద్ |
| 17. | శ్రీ తుమ్మల వల్లభయ్య | కూచిపూడి |
| 18. | శ్రీ నోముల స్వామిదాస్, శ్రీశ్రీపతి వెంకటరావు | సికిందరాబాద్ |
| 19. | శ్రీ వాసంశెట్టి రామకృష్ణారావు | వలసపాకల |
| 20. | శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ | గుంటూరు |

రాజపోషకులు:

1. శ్రీ కావూరి సంగయ్య కూచిపూడి
2. శ్రీ జె. వెంకటరావు వరంగల్
3. శ్రీ బి. శంకరలాల్ హైదరాబాద్
4. శ్రీ యలవర్తి రామకోటయ్య, సీతారత్నం కూచిపూడి
5. శ్రీ కుమ్మరి పోచయ్య సికిందరాబాద్
6. శ్రీమతి బొర్రా వేంకటరత్నమ్మ కూచిపూడి
7. శ్రీ యం. భూపతిరావు, ప్రజ్ఞాపురం హైదరాబాద్
8. శ్రీ సరిదె శ్రీనివాసరావు, కనకలక్ష్మి రేలంగి, గోదావరి(జి)
9. శ్రీ వి.యస్.గుప్త కొత్తగూడెం
10. కీ.శే. మలిపెద్ది సిద్దయ్య ధర్మపత్ని చంద్రమ్మ మర్మాముల
11. శ్రీమతి చదలవాడ రాజ్యలక్ష్మి కూచిపూడి
12. శ్రీ తలశిల శ్రీరాములు నాగాయలంక

పోషకులు:

1. శ్రీ మేకా రామకృష్ణయ్య కూచిపూడి
2. శ్రీ జాస్తి వెంకటప్పయ్య, తులశమ్మ కూచిపూడి
3. శ్రీమతి దాసరి రామకోటమ్మ కూచిపూడి
4. శ్రీమతి కన్నెగంటి శైలసుత నవరత్నకుమారి కూచిపూడి
5. శ్రీ కోట్ల రమణారెడ్డి సికిందరాబాద్
6. శ్రీ పోలం వీరయ్య సోదరులు సికిందరాబాద్
7. శ్రీ కోడూరి సుబ్బారావు సికిందరాబాద్
8. శ్రీ దుర్గా సత్యనారాయణ, కృష్ణవేణి తణుకు
9. శ్రీ కావూరి శివరామయ్య మోపిదేవి
10. శ్రీ గడ్డిపాటి వేంకట కృష్ణయ్య అమృతలూరు
11. శ్రీ చుండూరి శ్రీహరిరావు, శాంతకుమారి గుంటూరు
12. శ్రీ మల్లాది సూర్యనారాయణ మూర్తి రాజంపేట (తూ.గో.)

# సంపాదకీయము

జిజ్ఞాసువులైన మానవులు సంసార తరణోపాయమును వెదకు చుందురు. ఎన్నియో యితరజన్మములు పొందిన తరువాత కాని యీ మానవ జన్మము లభింపదు. అందుచేత దొరికిన మానవజన్మమును సార్థక మొనర్చుటకు మార్గము నన్వేషించుట వన్మానవుని లక్షణము. చాలా మంది బ్రహ్మచర్యముయొక్క గొప్పను గుర్తింపలేక ప్రతిమానవుడు పెండ్లి చేసికొనవలయు ననుబుద్ధితో వివాహమాడుటయు, సంతానము కను టయు, పోషణమునకు వలయు ధనధాన్యాదుల కూడబెట్టుటయు, అను భవించి రోసి యప్పుడేవో మోక్షమార్గము నన్వేషింతురు. కొందఱు పండి తులను జేరి భగవద్గీతాది గ్రంథములు పఠించుటయో, స్వాముల దాసి పాదపూజచేసి వేదాంత వాక్యశ్రవణము చేయుటయో, ప్రాణాయామము యోగాభ్యాసాదుల ద్వారా తరింపదలచి సంన్యాసులవెంట బడుటయో చేయు చుండురు. ఏ కొందఱో మాత్రము పూర్వజన్మసుకృతమువలన వేదధర్మ ప్రచారము చేయునట్టియు, పక్షపాతబుద్ధి రహితులైనట్టియు, సత్యమార్గ దర్శకులైనట్టి వారిచెంతజేరి, తరింపజేయు అష్టాంగయోగ మార్గమునవలం బించి నిష్కామ కర్మము లొనర్చుచు మోక్షగాము లగుదురు.

తెలుగు సాహిత్యములో రకరకముల గ్రంథములు గలవు. పురా ణములు, కావ్యములు, ప్రబంధములు, ఇతిహాసములు, లక్షణగ్రంథములు నిఘంటువులు, శతకములు, నాటకములు, నవలలు, చరిత్రములు మొద లైనవి. ఏ పండితుడో గుడిలోనో రచ్చబండమీదో కూర్చుండి తన కిష్ట మైన పురాణమును జదివి చెప్పుచుండగా జిజ్ఞాసువు లే కొలదిమందియోతప్ప మిగిలినవారు కాలక్షేపమునకై చేరుచుందురు. కావ్యములు, ప్రబంధములు- పాఠ్యభాగములుగా ప్రభుత్వముచే గాని విశ్వవిద్యాలయముచేగాని నిర్ణయింప బడుటచే పరీక్షలకు మాత్రము ఉపాధ్యాయులద్వారావిని విద్యార్థులు చదువు

దురు. ఇతిహాసములు — చరిత్రకారులకు, పూర్వపురుషుల యౌన్నత్యము తెలిసికొను కోరికగలవారికి మాత్రముపయోగపడును. లక్షణగ్రంథములు— పండితుల ద్వారా పరీక్షార్థము విద్యార్థులు చదివెదరు. నిఘంటువులు — కఠినపదముల కర్థమును గ్రహించుటకుపయోగపడును. శతకములు—నీతి జ్ఞాన, వైరాగ్య, భక్తి ప్రబోధకములు. నాటకములు - రంగస్థలముపై నాహ్లాదమునకై నటించువారికి, ప్రేక్షకులకు ప్రీతి కలిగించును. నవలలు- చరిత్రాత్మకము, అపరాధ పరిశోధకము మొదలగు పెక్కుభేదములతో పలురకములు గలవు. వీనిని కాలక్షేపము కొఱకే పెక్కురుపయోగింతురు. చరిత్రలు — మహాపురుషుల జీవనాదులగూర్చి తెల్పునవి.

అట్టి తెలుగులో నపూర్వమైన వైదిక సాహిత్యము నందించిన ఘనత పండిత గోపదేవ్ శాస్త్రిగారికే దక్కినది. వీరి కృతులైన సత్యార్థ ప్రకాశము, ఋగ్వేదాది భాష్యభూమిక, భగవద్గీత, ఉపనిషత్తులు, దర్శనములు మొదలైన గ్రంథములు చదివినచో తెలుగుజాతి కీ వాఙ్మయము ద్వారా వారు చేసిన సేవ వెల్లడికాగలదు.

ఈ ఐతరేయోపనిషత్తులో మూడధ్యాయములు గలవు. మొదటి దానిలో స్థూలపదార్థ వివరణము, శరీరాదులు ఏర్పడు విధానము, ఆ శరీరములందు జీవులు ప్రవేశించు పద్ధతి వర్ణింపబడినది. రెండవదానిలో జీవుని గర్భప్రవేశము, తొమ్మిదవ మాసమున జీవుడు తన దురవస్థను గుర్తించి, మోక్షప్రాప్తికి ప్రయత్నింప స్థిరమనస్కుడగుట గలదు. మూడవదానిలో జీవేశ్వరుల లక్షణము, జీవుడు పరమేశ్వరు నుపాసించి మోక్షము పొందు పద్ధతి విశదీకరింపబడినది.

కూచిపూడి ఆర్యసమాజ అనుబంధ సంస్థయైన అంబాదర్శనగ్రంథ మాలకు సంబంధించిన గ్రంథములను ముద్రించుభారము ఆ సమాజ పుస్తకాధ్యక్షులైన శ్రీయలవర్తి సూర్యనారాయణ, కార్యదర్శియైన శ్రీయలవర్తి

రామకోటయ్య, ఆ సమాజమునకు, అంబాదర్శన గ్రంథమాలకు సర్వాధారులైన పండిత గోపదేవ్ శాస్త్రిగార్ల యొక్క కోరికపై వహించితిని. 1969లో నేను ఉద్యోగ విరమణము చేసినపుడు శేషజీవితమును వేదధర్మ ప్రచారమునకు వినియోగింతునని ప్రతిజ్ఞ చేసితిని. ఈ వైదిక సాహిత్య గ్రంథ ముద్రణాదులుకూడ వేదధర్మ ప్రచారభాగముగా దలంచి యీకార్యముచేయుచున్నాను. పండిత గోపదేవ్ శాస్త్రిగారి రచనలైన యీ వైదిక సాహిత్య గ్రంథముల పఠించునపుడు కలిగెడి యనుభూతి యనుభవైక వేద్యమేకాని వ్రాయనలవికాదు. ఎంతటి లోతైన విషయమైనను వీరి తెలుగు [illegible] సుగమ మగుటచే ఆసక్తి, పట్టుదల, కొంత గ్రహింపగల జ్ఞానముండి చదివినచో నెవరైనను జ్ఞానులై వేదాంతులగుటలో సందియమే లేదు.

తెలుగు పాఠకలోకము వీరి వైదిక సాహిత్య గ్రంథముల పఠించి యిహపర సుఖముల నందుటకు ప్రయత్నించును గాక.

తెనాలి
1-11-82

—అరమండ్ల వెంకయార్య

# ఉపనిషత్ పరిచయము

ఆరణ్యకములలో ఐతరేయారణ్యక మొకటి. అది ఋగ్వేదమునకు సంబంధించినదిగా నెంచబడుచున్నది. అందు ఐదారణ్యకభాగములున్నవి. వానిలో పదునెనిమిది యధ్యాయములు గలవు. యోగ్యతను బట్టి మానవులను ఉత్తమ మధ్యమ నికృష్టభేదములతో ముప్విధములుగా నెంచి, యీ యారణ్యకమునందు బోధింపబడిన విషయము గూడ ముప్విధములుగా బోధింపబడినది.

నికృష్టశ్రేణి (నీచ తరగతి) కి జెందిన మానవులు ధనము, ఐశ్వర్యము, సుందరస్త్రీలు, మంచి సంతానము, పశుధనము, సుఖమయ జీవనాదులు నభిలషింతురు. అట్టివారి నుద్దేశించి, ఐతరేయారణ్యకమునందు మూడవ యారణ్యకము మొదలు ఐదవ యారణ్యకమువఱకు గల యధ్యాయములలో వివిధములైన ఉపాయములు ధనాదుల సంపాదించుటకు ననువైనవి వర్ణింపబడినవి.

మధ్యమశ్రేణికి జెందిన మానవులు లోకమున ప్రతిష్ఠ నాకాంక్షింతురు. సకామకర్మల నాచరించి స్వర్గాది భోగముల ననుభవింప గోరుదురు. లోకమున తమ ప్రాభవము చెల్లుబడి కావలయు నందురు. పరులపై నధికారము గలిగియుండ జూతురు. అట్టివారికి తగిన విధివిధానములు, ఉపాయములు, ప్రథమారణ్యకమునందును, ద్వితీయారణ్యకమున మూడవ యధ్యాయము వఱకును వర్ణింపబడియున్నవి.

ఇక ఉత్తమ తరగతికి జెందిన మానవులు ఏషణత్రయము (లోకేషణ, దారేషణ, విత్తేషణ) ను త్యజించి, దృష్టములు ఆనుశ్రవికములు నగు విషయములనుండి విరక్తులై - ఐహికాముష్మిక విషయ సుఖములను విడనాడి బ్రహ్మజ్ఞానము సర్వోత్తమముగా నెంచి తదర్థముపాటుపడుదురు.

అట్టివారికి యథార్థజ్ఞానము కలుగజేయు నిమిత్తము ఐతరేయారణ్యకము నందలి, ద్వితీయారణ్యకములోని నాల్గవ యధ్యాయము మొదలు ఆఱవ యధ్యాయ పర్యంతము - మూడు అధ్యాయములు ఐతరేయోపనిషత్తుగా విభజింపబడినది.

కాబట్టి యీ యైతరేయోపనిషత్తు ఋగ్వేదమునకు సంబంధించిన ఐతరేయారణ్యక భాగముగా గుర్తింపనగును. ఇయ్యది వేదభాగము కాదు. ఆరణ్యకభాగము. ఈ యుపనిషత్తునందు మూడు అధ్యాయము లున్నవి మొదటి యధ్యాయమున స్థూలములయిన పదార్థములు-శరీరాదులు ఏర్పడిన క్రమ వర్ణనము, ప్రాకృత శరీరమునందు జీవుడు ప్రవేశించు విధము చూడనగును. పరమేశ్వరుని సాక్షాత్కారము చేసికొనుటయే కొండొకని జాగ్రుతికి చిహ్న మనియు తెలియనగును.

ఈ యుపనిషత్తులోని ద్వితీయాధ్యాయమున జీవుడు గర్భమున ప్రవేశించు విధము తెలియును. తొమ్మిదవ నెలలో గర్భమున నున్న జీవుడు తన దురవస్థను గుర్తించును. పూర్వ పూర్వజన్మములందు తాననుభవించిన దుఃఖముల నట స్మరియించి పశ్చాత్తాపపడును. జన్మమరణరూప ప్రవాహమున గలుగు కష్టపరంపరనుండి తప్పుకొన ప్రతిజ్ఞ నొనర్చును. ఇట్లు క్రమముగా జాగృతిని బొంది సమ్యక్ జ్ఞానమును సంపాదించి మోక్షమును బొందు విధముకూడ నిందు జూడనగును.

ఇక తృతీయాధ్యాయమునందు జీవేశ్వరుల స్వరూపము బాగుగ బోధపడుటకై వారి కర్మ స్వభావములు వివరింపబడినవి. ఉపాసకుడగు జీవుడు ఉపాస్యుడైన పరమేశ్వరుని బాగుగ నెఱుగుటవలన మోక్షము ప్రాప్తించు ననియు నిందు వర్ణింపబడినది.

ప్రథమాధ్యాయమున మూడు ఖండములున్నవి. మొదటి ఖండమున లోకములు, ఇంద్రియాధిష్ఠానములయిన ముఖజిహ్వాదులు, ఇంద్రియశక్తులు-

వాగాదులు, అగ్ని మున్నగు లోకపాలకులగు దేవతలు సృష్టింపబడినట్లు వర్ణింపబడినది. రెండవ ఖండమునందు దేవతలకు తమ కార్యస్థానమైన శరీరమునందు తగినస్థానములను గల్పించుట జూడనగును. అగ్నిమున్నగు దేవతలకు ఆకలిదప్పికలతో సంబంధ మేర్పడుటయు నిట జదువవచ్చును. ఇక మూడవ ఖండమున అన్నసృష్టి, శరీరమున అన్నమును గ్రహించు తత్త్వనిర్ణయము, జీవుడు శరీరమున బ్రవేశించుటకు గల ప్రయోజనము, ప్రవేశమార్గము, దేహమున జీవు డుండుస్థానము, బాగుగ జాగృతిని బొందినవ్యక్తికి ఈశ్వర సాక్షాత్కారము కలుగుట మున్నగు విషయములు చూడనగును.

ద్వితీయ తృతీయాధ్యాయములలో నొక్కొక్క ఖండమే యున్నది. అనేక ఖండములు లేవు. ఇట్లు ఈయుపనిషత్తు ఆకారమున చిన్నదైనను బాగుగ తత్త్వజ్ఞానము కలిగించి, పాఠకులకు ఉపకారము చేయగలిగిన దగుటచే బుధజనగ్రాహ్యమైనది.

మార్చి 1968
హైదరాబాద్

బుధవిధేయుడు,
గోపదేవ్

ఓ౩మ్

# ఐతరేయోపనిషత్తు

## ప్రథమాధ్యాయము - ప్రథమఖండము

"ఆత్మా వా ఇద మేక ఏ వాగ్ర ఆసీత్
నాన్యత్ కించన మిషత్
స ఈక్షత లోకాన్ను సృజా ఇతి." ౧

అగ్రే = సృష్టికి పూర్వము, ఇదమ్ = ఈ కనబడు ప్రపంచము, ఆత్మా వా=ఆత్మయు (పరమేశ్వరుడు), ఏకః ఏవ ఆసీత్=ఒక్కటిగానే యుండెను, మిషత్=క్రియగలిగినది, అన్యత్ కించన=మఱియొకటి యేదియును, న (ఆసీత్)=లేదు, సః=ఆ పరమాత్మ, లోకాన్ ను = లోకములను - స్థావర జంగమరూపమున గననగు పదార్థములను, సృజే (సృజేయమ్)=సృజింతును, ఇతి ఈక్షత=అని యీక్షించెను - ఆలోచించెను.

శాస్త్రములందు వాడబడు 'ఆత్మ' (జీవ, పర, ప్రత్యక్, ఆది పదములతో సంయుక్తము కాని) పదము సామాన్యముగ పరమేశ్వర వాచకముగ నెంచబడును. (అత సాతత్యగమనే - అను) ధాత్వర్థమును బట్టి, (అతతి=సరత్ర నైరంతర్యేణ సర్వవస్తూని ప్రాప్నోతీ త్యాత్మా) అంతట నన్నింటి యందును నిరంతరముగ వ్యాపించి యుండునది ఆత్మ యని తెలియుచున్నది. అట్టి వస్తువు పరమేశ్వరుడే యగును. అతడు నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వభావుడు. సర్వశక్తిమంతుడు. సర్వజ్ఞుడు. అతడు స్థూలముగ నిపు డింద్రియములచే గ్రహింపబడు నీ ప్రపంచము జనించుటకు బూర్వమున దీనికి మూలకారణమగు సూక్ష్మప్రకృతితో గూడి యొక్కటిగ నుండెను అది ప్రళయకాలము. అప్పు డీ ప్రపంచమంతయు సూక్ష్మరూపము వహించి పరమేశ్వరునందే యుండెను. పరమేశ్వరునితో గూడి

యొక్కటిగా నుండెనని భావము. స్వరూప స్వభావములతో ప్రకృతి, ఈశ్వరుడు భిన్నములయ్యు భిన్నములుగా కనిపింపక యుండెనని యర్థము.

కారణరూపమున సూక్ష్మముగా నుండు వస్తువు నిమిత్తకారణము మూలమున స్థూలముగా మారుటయే సృష్టి యనబడును. లేని వస్తువు పుట్టుట సృష్టికాదు. సూక్ష్మరూపమున నుండు ప్రకృతి పరమేశ్వరుని ప్రేరణచే స్థూలరూపమున మారి ప్రపంచమగును. అదియే సృష్టి పరమేశ్వరుడు స్వ స్వభావానుగుణముగ తనలో నుద్భూతమగు లోకసిసృక్షతో – లోకములను సృష్టింపవలయునను కోరికతో గూడినవాడయ్యెను. సర్గ–క్రియ ప్రారంభమగుటకు ముందు పరమేశ్వరునందు సూక్ష్మమగు ప్రకృతిని స్థూలమొనర్పవలయునను కోరిక – ఈక్షణము కలిగెనని భావము;

(సృష్టింపబడుటకు బూర్వ మీ ప్రపంచము భూమి, జలము, అగ్ని, వాయువు మున్నగు నామములతో, నిప్పుడు వ్యవహరించుటకుదగియున్నట్లు లేకుండెను. అప్పుడిది యంతయు సూక్ష్మరూపమున నాత్మయందే యుండి, ఆత్మతోగూడి ఆత్మశబ్దముచేతనే చెప్పబడదగియుండెనని తెలియవలయును.

ఆత్మ శబ్ద వ్యుత్పత్తిని బట్టిచూచిన ప్రకృతిలో ఆత్మత్వము (నిరంతర వ్యాపకత) లేకున్నను, పృథివ్యాది స్థూలపదార్థములం దంతట సూక్ష్మముగా కారణరూపమున ప్రాప్తమై వ్యాపించి యున్నందున ప్రకృతియు యౌగికార్థముతో ఆత్మపదముచే జెప్పబడిన నంతగా దోషము కనుపింపదు. కావుననే ఉపనిషద్ వాక్యమునందు (ఆత్మా వా ఇదమ్ ఏక ఏవ) ప్రకృతికి ఆత్మతో నేకత్వము చెప్పబడినది. అంతమాత్రమున ప్రకృతికి ఆత్మకు భేదములేదని యెంచరాదు. స్వరూప స్వభావములలో నా రెండు తత్త్వము లును సదా భిన్నములే.

అట్లెంచక, 'సృష్టికి బూర్వ మాత్మ యొక్కటియే యుండెను. ప్రకృతి యనునది లేనేలేదు.' అని యెవరేని తలంతురేని సృష్టియైనపిదప ఈశ్వరునికంటె భిన్నముగా నింద్రియములచే గననగు నీ స్థూల ప్రపంచ

మునకు ఉపాదానకారణము ఆత్మయే యనవలసివచ్చును. అయిన దోషమే మందురేని, సదా సూక్ష్మము వ్యాపకము నగు నాత్మకును స్థూలముగనుండు నీ ప్రపంచమునకును గల భేదమునకు కారణము చెప్పవలసియుందురు. 'ఆత్మ ప్రపంచములకు మధ్య భేద మేలేదు. రెండును అభిన్నములే' అందురేని సృష్టికి బూర్వమున (ఏకః ఆసీత్) ఒక్కటియే యుండును. అను నీభూత కాలిక ప్రయోగమున కర్థమేమగును? 'ఉండెను' అనుటచే సృష్టికి పూర్వమున భేదములేదనియు తదుపరి కలదనియే కదా తెలియుచున్నది? సూక్ష్మావస్థలో లేని భేదము స్థూలావస్థలో నెటనుండి వచ్చును? కావున ఆత్మ యొక్కటితక్క మఱియొండు పదార్థము లేదనుట సరికాదు. ఆత్మయొక్కటియే యుండెననుట ఉపనిషత్కర్త కిష్టమగునెడల 'నాన్యత్ కించన = మఱియొకటి లేదు' అనియే మూలమున చెప్పియుండెడివాడు. 'నాన్యత్ కించన మిషత్' అని 'మిషత్' పదమును 'కించన' పదమునకు విశేషణముగ ప్రయోగించి యుండెడివాడు కాడు. 'మిషత్' అనగా నిమిషక్రియకలది యని యర్థము. క్రియకలిగిన స్థూలపదార్థము 'అన్యత్ కించన=మఱియొకటి, న=లేదు' అను నీ విశేషణము వ్యర్థముగా నేల ప్రయోగించును? కాబట్టి సృష్టికి పూర్వమున ఆత్మతోబాటు సూక్ష్మప్రకృతియు నుండెనని స్పష్టమగుచున్నది.

కాని, శ్రీశంకరస్వాములు ఇట్లు భాషించి యున్నారు.

"యథా సాంఖ్యానా మనాత్మపక్షపాతి స్వతంత్రం
ప్రధానం, యథా చ కాణాదానా మణవో, న
తద్వత్ ఇహాన్య దాత్మనః కించిదపి వస్తు విద్యతే,
కిం తర్హి ఆత్మైవైక ఆసీ దిత్యభిప్రాయః." శాం. భా.

'సాంఖ్యులు చెప్పునట్లు ఆత్మపక్షమున జేరని స్వతంత్రమైన ప్రధానము - ప్రకృతి కాని, కణాదప్రభృతులు చెప్పునట్లు పరమాణువు లనెడు వస్తువుకాని, వేఱుగ నింకొకటి లేదు. ఆత్మయొక్కటియే యుండెను.

శంకరాచార్యులు వ్రాసిన యీ భాష్యము మూలము ననుసరించి లేదు. కారణమేమన : సృష్టికి పూర్వ మాత్మ యొక్కటియే యుండినచో నీ స్థూలప్రపంచ మెటనుండి వచ్చినది ? మనకు కనబడు బ్రహ్మాండము ఆత్మకంటె భిన్నముగ లేదా? భిన్నముగనే యున్నది - ఎవరు కాదనగలరు? కావుననే శంకరస్వామి లిట్లు మరల శంకించి సమాధానము చెప్పుచున్నారు.

"కిం నేదానీం స ఏవైకః?" 'ఇప్పుడు—సృష్టికి తదుపరి ఆ యాత్మ యొక్కటియే కాదా?' అని శంకించి 'న'=కాదు, అని సమాధానము చెప్పి మరల ఇట్లనుచున్నారు.

"కథం తర్హి ఆసీత్ ఇత్యుచ్యతే, యద్యపీదానీం స ఏవైక స్తథాప్యస్తి విశేషః. ప్రాగుత్పత్తేః అవ్యాకృత నామ రూప భేద మాత్మభూత మాత్మైకశబ్ద ప్రత్యయ గోచరం జగత్ ఇదానీం వ్యాకృత నామరూపభేదత్వా దనేక శబ్ద ప్రత్యయ గోచర మాత్మైక శబ్దప్రత్యయ గోచరం చేతి విశేషః. యథా సలిలాత్ పృథక్ ఫేననామ రూప వ్యాకరణాత్ ప్రాక్ సలిలైక ప్రత్యయగోచర మేవ ఫేనం, యథా సలిలాత్ పృథక్ నామరూపభేదేన వ్యాకృతం భవతి తదా సలిలం ఫేనం చేత్యనేకశబ్ద ప్రత్యయభాక్ సలిల మేవేతి చైకశబ్ద ప్రత్యయభాక్ చ ఫేనం భవతి తద్వత్." శాం. భా.

సృష్టికి పూర్వ మొక్క యాత్మ కానిచో మఱి యే ముండును ? అందురేని చెప్పెదము వినుడు. 'ఆత్మ యొక్కటియే యప్పు డున్నను విశేషమున్నది. ఆ విశేష మేమన: ఉత్పత్తికి పూర్వ మీ జగత్తు వ్యాకృత నామ రూప భేదములు లేనిదై ఆత్మరూపముననే యుండి 'ఆత్మ యను నొకేశబ్ద ప్రత్యయమునకు విషయమై యుండియు, సృష్టి యేర్పడిన పిదప వ్యాకృత నామరూప భేదములవలన 'అనేక శబ్ద ప్రత్యయగోచరము, ఆత్మైక శబ్ద ప్రత్యయగోచరము' అను విశేషము కలదగుచున్నది అది యెట్లన : నురుగు నామరూపములతో నీటినుండి వేఱుగాకముందు నీరు

అని యొకే శబ్దముచే జెప్పబడును. నామరూపములతో నురుగు నీటినుండి వేఱైనపుడు నీరనియు నురుగనియు ఆ నురుగు చెప్పబడును. అట్లే యీ జగత్తు కూడ' అని శంకర భాష్యము.

శ్రీ శంకరస్వాములు ఆత్మపదార్థ మొక్కటితప్ప అన్య ప్రకృతి పదార్థము నంగీకరింపరు. కావున నిట సృష్టికి బూర్వము ఆత్మమాత్ర మున్నదని చెప్పి తదితరము లేదని సాధించుట కెంత ప్రయాస పడిరో పాఠకులు పరికింతురుగాక! అంతగా ప్రయాసపడి సాధించినదియు కని పింపదు. శంకరాచార్యులు సదా విషమ దృష్టాంతముల నూతగా గొని తమ సిద్ధాంతమును నిలుపుకొన జూతురు. స్థూలదృష్టితో జూచినపు డా దృష్టాంతములు విషమములుగా కనిపింపవు. సమములుగానే తోచును. కాని, పరీక్షకులకు వానిలోని విషమత సులభముగానే గోచరించును.

ప్రకృతమున 'ఆత్మ, జగత్తు నను నీ రెండింటిలో నెట్టి భేదములేదు. రెండును ఒకే పదార్థము' అని చెప్పుటకు సలిల ఫేనములను దృష్టాంత ముగా నుదాహరించి యున్నారు. (సలిలము=నీరు, ఫేనము=నురుగు) ఫేనము సలిలవికారము. నామరూపములతో సలిల ఫేనములు రెండును భిన్నములు; కాని పదార్థమొక్కటియే. అట్లే 'ఆత్మ జగత్తు నను రెండును నామరూపములలో భిన్నము లయినను వానిలో పదార్థభేదము లేదు' అని శంకరులు చెప్పుచున్నారు. కాని, యీ వాదము సరియైనది కాదు. కారణ మేమన : సలిలము ఫేనముగా మాఱును. అప్పుడది సలిల మనబడదు. ఫేన మనియే పిలువబడును. కాని, శంకరస్వాములు మాత్రము 'సలిలము, ఫేనము నని రెండు శబ్దములచే ఫేనము వ్యవహరింపబడు ననుచున్నారు. ఇయ్యది లోకవ్యవహార విరుద్ధము. నురుగును నీరని యెవరు పిలుతురు ? ఎవ్వరును పిలువరు. మఱియును, ఫేనముగా మాఱిన సలిలము సలిలముగా నుండదు. సలిలము వికృతమై ఫేనమగును. అందువలన నది సలిలము కాదు. ఫేనమే యగును. అట్లే యింద్రియగోచరమగు నీ జగత్తు నెవరైన

ఆత్మయని పిలుతురా! పిలువరు. కావున నిది ఆత్మ ప్రత్యయగోచరమనుట యెట్లు చెల్లును? ఇది జగచ్ఛబ్ద ప్రత్యయగోచరమే కాని, ఆత్మశబ్దప్రత్యయ గోచరము కానేరదు. ఆత్మ యొకప్పుడు అవ్యాకృత నామరూపములుకలదై, తదుపరి వ్యాకృత నామరూపములు కలిగి ఆత్మానాత్మ శబ్ద ప్రత్యయగోచర మగునా? అటు లగు నందురేని సలిలమే ఫేనమైనట్లు ఆత్మయే జగత్తుగా మాఱినదని యంగీకరింపవలసివచ్చును. అంగీకరింతు మందురేని, సలిలము వలె ఆత్మయు వికారి యగును. ఆత్మ వికృతమై జగత్తుగా మాఱి వ్యాకృత నామ రూపములు గలదైనపుడు ఆత్మ యనునది లే దనవలసివచ్చును. జలము ఫేనముగా మాఱినపుడు జలముండదా? అందురేని, ఫేనముగా మాఱిన జలము కాక మిగిలిన జలము జలముగా నుండును. అట్లే ఆత్మయు నందురేని, ఆత్మలో కొంతభాగము జగత్తుగా మాఱుననియు, మిగిలినభాగ మాత్మగా నుండుననియు చెప్పవలసివచ్చును. అప్పుడు ఆత్మలో కొంత వికృతము మఱికొంత యవికృతము నగును. కావున ఆత్మ వికారి యనక తప్పదు.

మఱియును ఆత్మయే జగత్తుగా మాఱిన పక్షమున మట్టి కుండకు, తంతువులు వస్త్రమునకు ఉపాదానము లైనట్లు ఆత్మ జగత్తునకు ఉపాదాన కారణ మగును. ఉపాదానకారణ గుణములే తద్వికారములైన కార్య పదార్థములందును నుండును. క్రొత్తవి యుండవు. కావున ఆత్మ జగత్తునకు ఉపాదానకారణ మగుచో నాత్మగుణములే తద్వికారమైన జగత్తునందును ఉండవలయును. ఆత్మలో లేనిగుణములు జగత్తులో నుండరాదు. కాని, పై నియమమునకు విరుద్ధముగా ఆత్మలో నున్న జ్ఞానానందాది గుణములు జగత్తునందు కనిపింపవు. ఆత్మలో లేని శబ్ద స్పర్శ రూపాదిగుణములు జడత్వ వినాశిత్వాదులు జగత్తున కనిపించుచున్నవి. ఇవియెటనుండివచ్చినవి? ఆత్మైక్యవాదు లిందులకు సమాధానములు చెప్పవలసియుందురు. శంకర స్వాముల మత మిట్లు విచారించినకొలది దోషపూరితముగా కనిపించును.

సలిల ఫేనములతో నాత్మ జగత్తులను బోల్చి యాత్మైకత్వమును సాధింప బూనుట మందమతులను మోసగించుట యగును కాని. ఆత్మైకత్వము సిద్ధింపదు. ఎక్కడి కెక్కడి దృష్టాంతమున నేదో యొకింత సామ్యము చూచి తప్పుకొనుట దార్శనిక లక్షణమును కాదు. పదార్థ విజ్ఞతకు అది ద్యోతకముకూడ కాదు. కావుననే సాంఖ్య కాణాదాదులు సూక్ష్మదృష్టితో జక్కగా పదార్థములను గుర్తించి, సృష్టికి బూర్వమున ఇదం శబ్దవాచ్యమగు స్థూలప్రపంచము సూక్ష్మరూపమున ప్రకృతి, ప్రధానము, పరమాణువులు నను నామములచే పేర్కొనదగు జడవస్తువుగ - నొండు ఆత్మతో నున్నట్లంగీకరింతురు. దాని నుపాదానముగ గ్రహించియే ఆత్మ(పరమేశ్వరుడు) ఈస్థూలజగత్తును నిర్మించును. కావున ఆత్మ నిమిత్తకారణము-కర్తయగును. కర్తృగుణములు కార్యమున సంక్రమింపవలయు నను నియమము లేదు. అందువలన దోష మొండును నుండదు. ఇదియే వేదతత్త్వవిదులైన కపిల కణాదాదిమహర్షుల సిద్ధాంతము. ఇట్టి యార్ష సిద్ధాంతము నంగీకరింపకుండుట వైదికులకు లక్షణము కాదు. సముచితమును కాదు. శ్రీ శంకరులీ యార్షవాదమును కాదని వైదికు లెట్లగుదురో దురూహ్యము.)

లోక సృష్టిక్రమము :-

"స ఇమాన్ లోకా నసృజ తాంభో
మరీచీ మర మాపోఽదోఽంభః పరేణ దివం
ద్యౌః ప్రతిష్ఠాంతరిక్షం మరీచయః
పృథివీ మరో యా అధస్తా త్తా ఆపః." ౨

సః=ఆ పరమేశ్వరుడు, అంభః, మరీచీ, మరమ్, ఆపః=అంభస్సు, మరీచి, మరము, ఆపస్సు అనెడి, ఇమాన్ లోకాన్=ఈ నాల్గులోకములను, అసృజత=సృజించెను, దివం పరేణ = ద్యులోకమునకు పరమున, అదః అంభః=ఈ యంభస్సును సృష్టించెను, (దానికి) ద్యౌః ప్రతిష్ఠా=ద్యులోక మాధారము, (తదుపరి) అంతరిక్షమ్=అంతరిక్షము, (అందు) మరీచయః=

మనస శ్చంద్రమా, నాభిర్ నిరభిద్యత-
నాభ్యా అపానో, అపానాన్ మృత్యుః శిశ్నం
నిరభిద్యత - శిశ్నాద్ రేతో, రేతస ఆపః.” ౪

సః=ఆ పరమేశ్వరుడు, తం=ఆ విరాట్ పురుషుని, అభ్యతపత్=తపింపజేసెను, అభిత ప్తస్య తస్య ముఖం=త ప్తముచేయబడిన ఆ పురుషుని ముఖము, అండమ్ యథా=గ్రుడ్డువలె, నిరభిద్యత=పగిలెను, అండమున పెజ్జ మేర్పడునట్లు విరాట్పురుష ముఖము సచ్ఛిద్ర మయ్యెనని భావము. ముఖాత్ =ఆ పగిలిన ముఖమునుండి, వాక్=వాక్కు-శక్తి యుద్భవించెను. వాచః=ఆ వాక్శక్తినుండి, అగ్నిః = అగ్ని పుట్టినది, నాసికే నిరభిద్యేతామ్=నాసికాపుటములు తెఱవబడెను, నాసికాభ్యాం = ఆముక్కు రంధ్రములనుండి, ప్రాణః=జీవన సాధనమైనప్రాణము జనించినది, ప్రాణాద్ వాయుః=ఆ ప్రాణమునుండి స్థూలవాయువు కలిగినది, (పిమ్మట) అక్షిణీ నిరభిద్యేతామ్ = రూపగ్రాహకమగు నేత్రేంద్రియమున కాధారములయిన కన్నులు జనించినవి, అక్షిభ్యాం చక్షుః = నేత్రములనుండి రూపమును గ్రహించు నేత్రేంద్రియ మేర్పడెను, చక్షుషః ఆదిత్యః=చక్షువునుండి ఆదిత్యు డుద్భవించెను, (తదుపరి) కర్ణౌ నిరభిద్యేతామ్=కర్ణరంధ్రములు ఏర్పడెను, కర్ణాభ్యాం శ్రోత్రమ్=కర్ణరంధ్రములనుండి శ్రవణేంద్రియము - శబ్దగ్రహణశక్తి జనించెను, శ్రోత్రాత్ దిశః= శ్రోత్రమునుండి దిక్కులు జనించెను, త్వక్ నిరభిద్యత=స్పర్శకు ఆశ్రయమైన చర్మ మేర్పడెను, త్వచః లోమాని=చర్మమునుండి రోమములు, లోమభ్యః ఓషధి వనస్పతయః = వెండ్రుకలనుండి ఓషధులు, వనస్పతులు, (తదుపరి) హృదయమ్=హృదయము, హృదయాత్ మనః=ఆ హృదయమునుండి మనస్సు, మనసః చంద్రమాః=మనస్సునుండి చంద్రుడు, ఉద్భవించెనని యర్థము, (తరువాత) నాభిః అభిద్యత = నాభి భిన్నమయ్యెను, నాభ్యాః అపానమ్=నాభినుండి అపానము-విసర్జేంద్రియము, అపానాత్ మృత్యుః=

ఆ యపానమునుండి మృత్యువు జనించెను, (పిమ్మట) శిశ్నం నిరభిద్యత = జననేంద్రియము పుట్టెను, శిశ్నాత్ రేతః=దానినుండి రేతస్సు, రేతసః ఆపః=ఆ రేతస్సునుండి జలము, ఉద్భవించినది అని యర్థము.

పరమేశ్వరుడు స్థూల ప్రపంచమును సృష్టింపనెంచి, విరాట్పురుషు నుద్భవింపజేసె నని వ్రాసి యుంటిమి. సూక్ష్మజగత్తుయొక్క స్థూలరూపమే విరాట్పురుషుడు. అది యొక యవికసిత పిండరూప మనదగి యుండెను. పరమేశ్వరు డా విరాట్పురుషుని తపింపజేసె నని వర్ణింపబడినది. జ్ఞానపూర్వకముగ పరమేశ్వరుడు స్థూలసృష్టి నొనర్చె నని భావము.

(ఇట తపః శబ్ద మీశ్వరుని జ్ఞానమును సూచించును. పరమేశ్వరుని తపస్సు జ్ఞానమయమని(యస్య జ్ఞానమయం తపః) అన్యత్రవర్ణింపబడినది. కావున సూక్ష్మమై యున్న ప్రకృతికి ఈశ్వరుడు జ్ఞానపూర్వకముగ స్థూలరూప మొసగి తన్మాత్రల నుద్భవింపజేసె ననుటయే పురుషుని తపింపజేసె ననుటలో గల భావము. తన్మాత్రావస్థలో నున్న విరాట్రూప ప్రపంచము నింకను స్థూల మొనర్చుటకై యీశ్వరు డీక్షించుటయే తడవుగా అండజోత్పత్తి కనువుగా నండము భిన్నమగునట్లు విరాట్రూప బ్రహ్మాండ ముఖము భిన్నమయ్యెను — తెఱవబడెను. తెఱచిన ముఖమునుండి వాక్కు వెలువడునట్లు విరాట్టు ముఖమునుండి వాక్శక్తి యుద్భవించెను. ఇదియే భౌతికాగ్ని సూక్ష్మరూపము. దానినుండి స్థూలమగు భౌతికాగ్ని - పంచభూతములలో నొకటియగు అగ్నిదేవత యుద్భవించెను. శాస్త్రకారులు వాక్కు తైజసాంశముగానే చెప్పుదురు.

"త ఏవ త్రయో దేవాః; వాగేవాగ్నిః,
మనో వాయుః, ప్రాణః సూర్యః."

'అవియే యా మూడుదేవతలు. వాక్కే అగ్ని, మనస్సు, వాయువు' ప్రాణము సూర్యుడు' అని శతపథ బ్రాహ్మణమున జూడనగును. అందే

మఱియు "అగ్నిర్ వాగ్ భూత్వా ముఖం ప్రావిశత్" 'అగ్నియే వాక్కయి ముఖమున ప్రవేశించెను' అనియు నున్నది.

కావున స్థూలమగు భౌతికాగ్నికి తైజసమగు వాక్కు కారణమనుట యుక్తమే. అందువలననే యుపనిషత్తు అగ్ని వాక్కునుండి యుద్భవించెననుచున్నది. లోకమునగల పదార్థములను బాగుగ పరిశీలించినపుడు కార్య కారణముల స్వరూపము తెలియనగును. బీజము వృక్షమునకు కారణము. ఆవృక్షము మఱియొండు బీజమునకు కారణ మగును. అప్పుడు బీజ మా వృక్షమునకు కార్యమగుచున్నది. ఇట్లు స్థూల సూక్ష్మపదార్థములు కార్య కారణ స్థానముల నాక్రమించుట బుద్ధిమంతులు గమనింపదగిన విషయము. కార్యపదార్థములు కారణరూపమును బొందుటయే విలయము — నాశము అగును. కావున ప్రళయమునందు స్థూలపదార్థము లన్నియు స్వస్వ కారణ రూపములను వహించి యుండుననుట నిక్కువము. ఉత్పన్నమగునపుడు తమ తమ యుపాదాన కారణవస్తువులనుండి యుత్పన్నము లగును. కావుననే ఉపనిషద్ వాక్యములందు ముఖనాసికాదీంద్రియములు, వానినుండి యేర్పడిన అగ్ని మున్నగు స్థూలదేవతల యుత్పత్తి క్రమముగా వర్ణింపబడినది. ఇట ముఖాదీంద్రియములు ఆ యా స్థూలములగు నగ్ని మున్నగు స్థూల దేవతలకు సూక్ష్మకారణరూపము లయిన తన్మాత్ర స్వరూపములుగా గుర్తింపవలయును. వాక్కు అగ్నితన్మాత్ర. అందువలన వాక్కునుండిస్థూలమగు భౌతికాగ్ని యుద్భవించినట్లు వర్ణింపబడినది. అట్లే నాసికాపుటములు వాయుతన్మాత్ర. దానినుండి ప్రాణము-స్థూలవాయువు జనించినది. నేత్రము అగ్నితన్మాత్ర. దానినుండి సూర్యుడు, కర్ణములు శబ్దతన్మాత్ర. దానినుండి శ్రోత్రము — ఆకాశము - దిశలు ఉద్భవించెను. త్వక్కు స్పర్శతన్మాత్ర. దానినుండి త్వగింద్రియము - చర్మము, రోమములు, ఓషధులు మున్నగునవి జనించినవి. హృదయమునుండి మనస్సు, చంద్రుడు, నాభినుండి అపానము, మృత్యువు, శిశ్నమునుండి రేతస్సు, ఇట్లు క్రమముగా సూక్ష్మ

పదార్థముల నుండి స్థూలపదార్థము లేర్పడినవని గుర్తింపవలయును. యజుర్వేద పురుషసూక్తమునందు నిట్టి వర్ణనము చూడనగును.

"చంద్రమా మనసో జాతః, చక్షోః సూర్యోఽజాయత;
శ్రోత్రాద్ వాయుశ్చ ప్రాణశ్చ, ముఖా దగ్ని రజాయత."

'మనస్సునుండి చంద్రుడు, చక్షువునుండి సూర్యుడు, ఆకాశము (శ్రోత్రాత్) నుండి వాయు ప్రాణములు, ముఖమునుండి అగ్నియు పుట్టెనని మంత్రాభిప్రాయము.'

ఇట్లు సూక్ష్మపదార్థములను స్థూలములుగా జేయుటయే పరమేశ్వరుని ఈక్షణము—అభిధ్యానము—కార్యము అని గుర్తింపనగును. కావున సూక్ష్మ ప్రకృతిరూపమునుండి స్థూలరూపమును ధరించు నీ జగత్తు సృష్టికి పూర్వము - ప్రళయకాలమున పరమేశ్వరునికంటె వేఱుగా నుండెననియు, పరమేశ్వరుడు ప్రకృతికంటె వేఱుగా నుండెననియు, ఆ పరమేశ్వరుడే జగద్రూపకార్యమును సృష్టించుకర్తయనియు స్పష్టముగా నెఱుగవలయును.

ప్రథమఖండము సమాప్తము



# ప్రథమాధ్యాయము - ద్వితీయఖండము

"తా ఏతా దేవతాః సృష్టా అస్మిన్ మహ త్యర్ణవే ప్రాపతన్
త మశనాయా పిపాసాభ్యా మన్వవార్జత్,
తా ఏన మబ్రువన్, ఆయతనం నః ప్రజానీహి
యస్మిన్ ప్రతిష్ఠితా అన్న మదా మేతి." ౧

తాః ఏతాః దేవతాః=పరమేశ్వరునిచే సృష్టింపబడిన అగ్ని మున్నగు దేవతలు, సృష్టాః=సృష్టింపబడినవై, అస్మిన్ మహతి అర్ణవే =(సంసారమనెడి) ఈ గొప్పసంద్రమునందు, ప్రాపతన్=పడెను, తం=(దేవతాత్మకమగు) ఆ విరాట్ పురుషుని, అశనాయా పిపాసాభ్యామ్=ఆకలిదప్పికలతో, అన్వవార్జత్=సంయుక్తము చేసెను, తాః=ఆ యగ్ని మున్నగు దేవతలు, యస్మిన్ = దేనియందు, ప్రతిష్ఠితాః = ఉన్నవారమై (ఉండి), అన్నమ్ అదామ=అన్నము భుజింపగలమో, ఆయతనం=అట్టి యింటిని, నః = మాకు, ప్రజానీహి ఇతి=నియత మొనర్పుము అని, ఏనమ్=పరమేశ్వరుని, అబ్రువన్=అడిగెను.

"తాభ్యో గా మానయత్ తా అబ్రువన్
న వై నోఽయ మల మితి,
తాభ్యోఽశ్వ మానయ త్తా అబ్రువన్
న వై నోఽయ మల మితి." ౨

తాభ్యః=ఆ దేవతలకొఱకు, గామ్ ఆనయత్=గోవును తెచ్చెను, (దానింజూచి) తాః=ఆ దేవతలు, అయం నః వై న అలమ్=ఇదిమాకు చాలదు, ఇతి అబ్రువన్=అని పలికిరి, తాభ్యః=ఆ దేవతలకొఱకు, అశ్వమ్ ఆనయత్=అశ్వమును దెచ్చెను, (అంతట) తాః అయం నః వైన అలమ్ ఇతి అబ్రువన్=ఆ దేవతలు (మరల) ఇది మాకు చాల దనిరి.

"తాభ్యః పురుష మానయత్, తా అబ్రువన్
సుకృతం బ తేతి, పురుషో వావ సుకృతమ్,
తా అబ్రవీద్ యథాఽఽయతనం ప్రవిశ తేతి." 3

తాభ్యః=ఆ దేవతలకొఱకు, పురుషం = మానవశరీరమును, ఆన యత్=తెచ్చెను - కలిగించెను, తాః=ఆ దేవతలు (ఆ శరీరమునుజూచి), బత=ఆహాః సుకృతమ్=బాగుగ నిర్మింపబడినది, పురుషః వా వ సుకృతమ్=మానవశరీరము నిశ్చయముగ చక్కగ నిర్మింపబడినది- ఇతి అబ్రువన్=అని యనిరి, తాః = (అంతట) ఆ దేవతల నుద్దేశించి, పరమేశ్వరుడు, యథా ఆయతనమ్= ఈ యింటియందు మీకు తగిన స్థానములలో, ప్రవిశతి ఇతి అబ్రవీత్=ప్రవేశించుడు, అని యాదేశించెను.

ప్రథమ ఖండము నందు పరమేశ్వరుడు లోకములను సృష్టించి, తదుపరి లోకపాలకులను సృష్టింపనెంచి, అగ్ని, వాయువు, ఆదిత్యుడు, దిక్కులు, వనస్పతులు,చంద్రుడు,మృత్యువు, జలము నను వానిని సృష్టించె నని చెప్పియుంటిమి. ఇట ద్వితీయ ఖండమున నాయగ్ని మున్నగు దేవతలతో నేర్పడిన శరీరాది స్థూలసృష్టి విషయమును ఉపనిషత్కర్త ఆలంకారికముగ వర్ణించుచున్నాడు. అగ్ని మున్నగు దేవతలు జగత్తున గనబడెడి పృథివి, జలము, అగ్ని, వాయువు మున్నగు స్థూలపదార్థములు, చక్షుః శ్రోత్రాదీంద్రియములుగా గుర్తింప నగును.

పరమేశ్వరునిచే సృష్టింపబడిన అగ్ని వాయ్వాది దేవతలు సంసారము—ప్రపంచము అనెడి గొప్ప సంద్రమునందు పడి నిలువ స్థానములేని వయ్యెను. వానిని క్షుత్పిపాసలు బాధింపదొడగెను. అంతట నా దేవతలు తమకు తినుటకు త్రాగుటకు ననువగు నొకస్థానమును గల్పింపు మని సృష్టికర్త నర్థించెను. సృష్టికర్త మొదట నొక గోవును సృష్టించి యందుండి మీ క్షుత్పిపాసలు తీర్చుకొనుడనెను. ఆ శరీరము దేవతలకు రుచింపదయ్యె. అంతట నా సృష్టికర్త అశ్వశరీరమును సృష్టించి యా దేవతలయెదుట

నుంచగా నదియు నా దేవతలకు గ్రాహ్యము కాదయ్యె. చివరకు పరమే శ్వరుడు మానవ శరీరము సృష్టించి దేవతలయెదుట నుంచగా నది యా దేవతల కెంతో యుత్తమ రచనగా కనబడెను. సృష్టికర్త యా మానవ శరీరమును జూచి దేవతల నందు మీ కనువగు స్థానముల నేర్పఱచుకొను డని యాజ్ఞాపించెను.

(జగత్తునందుండు ప్రాణులకు సుఖదుఃఖములు కలుగుచుండును. ఆ సుఖదుఃఖములకు కారణములు అగ్ని, వాయువు మున్నగు దేవతలే. అగ్ని వాయ్వాది పదార్థములు దివ్యగుణములు కలవి యగుటచే నవి దేవత లనబడును. ప్రాణుల శరీరములు కూడ పృథివ్యాది పంచభూతముల మూలముననే యేర్పడును. నేత్రాదీంద్రియములును భూత పంచకములకు జెందినవే. ఆ యింద్రియములచే గ్రహింపబడు శబ్దస్పర్శరూపాదిగుణములు, ఆ గుణములతో గూడిన పదార్థములు నన్నియు భూత పంచకమునకుమించి వేఱొండు కావుగదా? కావున నగ్న్యాది దేవతలే స్థూల సూక్ష్మరూపము లలో మార్పులం జెంది ప్రాణుల శరీరము లగుచున్నవి. అందు జీవులు ప్రవేశింతురు. జీవు లాశరీరములం దుండి, నానావిధకర్మము లాచరించి, తత్ఫలితముగా సుఖదుఃఖము లనుభవించుచుండుట లోకసిద్ధ విషయము. ఇట్లు సుఖదుఃఖాత్మకమగు నీ సంసారము గొప్పసముద్రముతో బోల్పబడి నది. సముద్రము విశాలమై పారము కనిపింపనిది. అది యగాధము, అందు పడినవారికి దరి దాపు కనిపింపదు. అది దుర్గమము. ఆ సంసారసాగ రము అవిద్యాది క్లేశములతో గూడి తరింప సాధ్యముగాని దగును. తీవ్ర రోగములు, జరామృత్యువులు మహాగ్రాహముల వంటివి. విషయేంద్రియ సంయోగజన్య సుఖానుభవములు ప్రాణిని సంసార సాగరమున నిమజ్జితుం జేయుచుండును. ధనకనకవస్తువాహనాదులను సంపాదింపవలెననెడి తృష్ణకు వశులై ప్రాణులు అనేకానర్థములకు గుఱియగుదురు. ఇట్టి సంసార సాగర మును దాటుటకు యమనియమాద్యష్టాంగ యోగసాధన మనెడి నౌక తక్క

మంతియొండు సాధనములేదు. అగ్ని వాయ్వాది దేవతల సంఘాతముచే నేర్పడిన శరీరమునందు జీవులు బద్ధులై గుణకర్మల నొనరించి క్రమముగా తత్త్వజ్ఞానము నార్జింతురు. అదియే వారికి తరణోపాయము.

క్షుత్పిపాసలు జీవునితో గూడియుండు దేహమునకు ధర్మములు. కాని యిట నుపనిషత్తులో అగ్ని మున్నగు దేవతల కవి కలిగినట్లు వర్ణింపబడినది. రెండు వస్తువుల కలయికచే నేర్పడునవి యా రెండింటికిని సంబంధించినవే యగును. అట్టియెడ నవి యేదేని యొకదానికి సంబంధించినట్లు చెప్పుట యనుచితము కాదు. వాస్తవమున క్షుత్పిపాసలు శరీరమునందున్న జీవునకే కలుగును. వానికి శరీర మాధార మగును. అందువలన నవి జీవునకు జెందినవైనను శరీరమునకు సంబంధించినట్లు చెప్పబడినవి.

"అద్యతే అత్తి చ భూతాని తస్మా దన్నం తదుచ్యతే"

'తినబడునదియు తినునదియు కావున అన్న మనబడును.'

జడపదార్థములు కూడ లోకమున నొండొంటిని తినుట జూతుము. అగ్ని జలమును భక్షించును. జల మగ్నిని తినివేయును. ఇట్లే యితర పదార్థములు నొకదాని నింకొకటి నశింపజేయుటను తినుటతో బోల్చి ఆకలి దప్పికలు జడములగు నగ్న్యాది దేవతలకు కలుగుననుట యనుచితము కాదని భావము. అయినను జడములలో కంటె ప్రాణులలో క్షుత్పిపాసలు కలుగుట మిక్కిలి స్పష్టము. అందువలననే యుపనిషత్తునందు గోవు, అశ్వము, మనుష్యుడు నను ప్రాణులశరీరములు గ్రహింపబడినవి. అగ్న్యాది దేవతలు గవాశ్వదేహములు తగినవిగా నెంచక మానవదేహమును సుకృతము - సురచితముగా నంగీకరించుటలో గల కారణము మానవదేహము పశ్వాదిదేహములకంటె నుత్తమ మగుటయే. ఆహారాదులకు అనువగు పదార్థములను సేకరించి, వానిని తగినట్లు మార్చుకొని యనుభవింపననువగు బుద్ధి మున్నగు నుత్తమసాధన సంపత్తితో గూడి యుండినందున మానవ దేహము మిగిలిన దేహములకంటె నుత్తమ మగుట నిస్సందిగ్ధము.

అగ్ని మున్నగు దేవతలు జడములు. అవి సంభాషింపనేరవు. జీవుడే మాటలాడ శక్తిగలవాడు. అతనికి అగ్న్యాదిజడపదార్థ సంజనితము లయిన వాగాదీంద్రియములు సాధనములు. వానితో సంభాషణాది కార్యములనొనర్చును. కాని, వాగాదీంద్రియములే మాటలాడును; వినును, చూచును, అనుట జీవుడొనర్చు కర్మలకు ఉపలక్షకములని యెంచవలయును. లేక, యా కర్మలు జీవేంద్రియోభయ సంయోగజన్యము లగుటచే నుభయ సంబద్ధములై జీవుడు సంభాషణాదులను నొనర్చును. వాగాదీంద్రియములు కూడ సంభాషణాదుల నొనర్చుననుటయు ననుచితముకాదు. ఇట్లే సృష్టికర్తతో దేవతలు సంభాషించుట కల్పనయే కాని మఱియొండు కాదు.

"అగ్నిర్ వాగ్ భూత్వా ముఖం ప్రావిశత్
వాయుః ప్రాణో భూత్వా నాసికే ప్రావిశత్
ఆదిత్య శ్చక్షుర్ భూత్వాఽక్షిణీ ప్రావిశత్
దిశః శ్రోత్రం భూత్వా కర్ణౌ ప్రావిశన్
ఓషధి వనస్పతయో లోమాని భూత్వా త్వచం ప్రావిశన్
చంద్రమా మనో భూత్వా హృదయం ప్రావిశత్
మృత్యు రపానో భూత్వా నాభిం ప్రావిశత్
ఆపో రేతో భూత్వా శిశ్నం ప్రావిశన్." ౪

అగ్నిః=అగ్ని, వాక్ భూత్వా=వాక్కుగామాఱి, ముఖంప్రావిశత్= ముఖమునందు ప్రవేశించెను. ఇట్లే, వాయువు ప్రాణమై, ముక్కులలోను, ఆదిత్యుడు నేత్రమై కన్నులందును, దిక్కులు శ్రోత్రము-శ్రవణేంద్రియమై చెవులలోను, ఓషధులు వనస్పతులు రోమములై చర్మమునందును, చంద్రుడు మనస్సై హృదయమునందును, మృత్యువు అపానమై నాభియందును, జలము రేతస్సై శిశ్నమునందును ప్రవేశించెను.

ప్రథమఖండములోని చివరి వాక్యమునందు (ముఖాద్వాక్.........) 'ముఖమునుండి వాక్కు, దానినుండి యగ్ని పుట్టె' నని చెప్పబడినది.

ఇట అగ్ని వాక్కుగా మారి ముఖమున బ్రవేశించెనని వర్ణింపబడినది ఇట్లే వాయ్వాది దేవతలు కూడ నాసికాదులం బ్రవేశించినట్లు నుడువబడినది. అందువలన వాగాదీంద్రియములకు అగ్న్యాది దేవతలకు గల కార్యకారణ భావ సంబంధము, పరస్పరోత్పత్తి, పరస్పర విలీనతయు స్పష్టము చేయ బడినట్లు గ్రహింపవలయును.

ఘటము మృత్పరిణామము. కావున మృత్తిక (మట్టి) ఘటమునకు సమవాయికారణము - ఉపాదానకారణము, ఘటము మృత్తిక కార్యము. కావున కార్యము నశించినపు డది సమవాయి కారణ రూపమును ధరించును. కార్యము సమవాయి కారణమునందే యుండును. సమవాయి కారణము తత్కార్యము విడివిడిగా నుండ జాలవు. మట్టి ఘటము (కుండ) గా మారి నపు డా ఘటము తనకు సమవాయి కారణమైన మట్టిలోనే యుండును. అది నశించినపుడును మట్టిలోనే యుండును. మట్టిగా నుండునని భావము. అట్లే ముఖమునం దుద్భవించిన వాక్‌శక్తివలన అగ్నిపుట్టి, యది తనకు సమవాయి కారణమైన వాక్కురూపమున ముఖమునందే ప్రవేశించినదని యిట తెలుపబడినది. మిగిలిన వాయ్వాది దేవతలుకూడ శరీరమునందు తమ యుత్పత్తికి కారణములయిన నాసికాదులందు ప్రవేశించినవని తెలిసికొనవలయును.

"త మశనాయా పిపాసే అబ్రూతామ్
ఆవాభ్యా మభిప్రజానీ హీతి, స తేఽబ్రవీత్
ఏతాస్వేవ వాం దేవతా స్వాభజా మ్యేతాసు
భాగిన్యౌ, కరో మీతి, తస్మాద్ యస్యై కస్యై చ
దేవతాయై హవిర్ గృహ్యతే భాగిన్యా
వే వాస్యా మశనాయా పిపాసే భవతః." ౫

అశనాయాపిపాసే=ఆకలి దప్పికలు, తం=ఆ పరమేశ్వరునిగూర్చి, ఆవాభ్యామ్=మా యిరువురికొఱకు గూడ, అభి.ప్రజానీహి=ఆయతనము–

ఉండు స్థానమును జూపుము, ఇతి అబ్రూతామ్=అని యడిగెను, సః = ఆ పరమేశ్వరుడు, తే=ఆకలిదప్పికల నుద్దేశించి, ఏతాసు దేవతాసు ఏవ= ఈ దేవతలంచే, వామ్ = మీకును, ఆభజామి=స్థానము నేర్పఱతును, ఏతాసు=వీనియంచే, భాగిన్యౌ = భాగములు కలవిగా, చేయుదును, ఇతి అబ్రవీత్=అని పలికెను, తస్మాత్=అందువలన, యస్యై కస్యై చ దేవతాయై = ఏ దేవతకొఱకైనను, హవిః = హవిస్సు, గృహ్యతే = గ్రహింపబడినను, అస్యాం=ఆ దేవతయందు, అశనాయాపిపాసే=ఆకలి దప్పికలు, భాగిన్యౌ ఏవ=భాగములు కలవియే, భవతః=అగును.

పరమేశ్వరుడు పదార్థములను సృష్టించుచు వానియందే యేశక్తులను - గుణములను నిర్మించెనో యా యా శక్తుల కనుగుణముగ నాపదార్థములు నశించువఱకు తమ గుణములను ప్రదర్శించుచునే యుండును. అగ్ని వాయ్వాది దేవతలు ప్రపంచము నందలి స్థూలకార్యములకు కారణములు. వానియంచే యాకలిదప్పికలు కలుగునట్లు పరమేశ్వరుడు నిర్మించి యున్నాడు. కావుననే పృథివ్యాది భూత పంచకముచే నేర్పడు నీ శరీరమునందాకలి దప్పికలు కలుగుచుండును. హోమాదులందర్పింపబడు హవ్యద్రవ్యములుకూడ పంచభూతముల కలయికచే నేర్పడు పదార్థములతోనే సిద్ధము చేయబడును. 'అగ్నయే స్వాహా' 'వాయవే స్వాహా' అను నిత్యాది వాక్యముల నుచ్చరించుచు అగ్ని వాయ్వాది దేవతల నుద్దేశించి యొసంగు హవ్యద్రవ్యములు లా దేవతలను జేరునపుడు వానిలోనుండు క్షుత్పిపాసలుకూడ తమ భాగములను గ్రహించునని భావము.

ద్వితీయఖండము సమాప్తము



## ప్రథమాధ్యాయము - తృతీయఖండము

"స ఈక్షత తేమే ను లోకాశ్చ లోకపాలాశ్చ
అన్న మేభ్యః సృజా ఇతి." ౧

ఇమే లోకాః చ=ఇవి లోకములు, లోకపాలాః చ=వీరు లోకపాలకులును, ఏభ్యః=వీరికొఱకు, అన్నమ్=తినదగిన వస్తువును, సృజై = సృజింతును, ఇతి = అని, సః=ఆ పరమేశ్వరుడు, ఈక్షత = మరల ఈక్షించెను.

"సోఽపోఽభ్యతప త్తాభ్యోఽభితప్తాభ్యో
మూర్తి రజాయత, యా వై సా మూర్తి
రజాయత అన్నం వై తత్." ౨

సః=ఆ పరమేశ్వరుడు, అపః=జలమును, అభ్యతపత్=తప్తము చేసెను, తాభ్యః అభితప్తాభ్యః=ఆ తప్తజలమునుండి, మూర్తిః అజాయత = మూర్తి యుదయించెను, యా సా మూర్తిః అజాయత తత్ వై అన్నమ్=ఆ జనించిన మూర్తియే అన్నము.

"త దేత దభిసృష్టం నదత్ పరాఙ్ అత్యజిఘాంస
త్తద్ వాచాఽజిఘృక్షత్త న్నాశక్నోత్ వాచా
గ్రహీతుమ్, స య ద్ధైనద్ వాచాఽగ్రహైష్య
దభివ్యాహృత్య హైవాన్న మత్రప్స్యత్." ౩

తత్ ఏతత్ అభిసృష్టమ్=ఇట్లు సృష్టింపబడిన అన్నము, నదత్= ధ్వనిచేయుచు, పరాఙ్ అత్యజిఘాంసత్=దేవతలకుదూరముగ పోగదలచెను, తత్ = ఆ యన్నమును, వాచా=వాక్కుతో, అజిఘృక్షత్ = గ్రహింప దలచెను. తత్ వాచా గ్రహీతుం న అశక్నోత్=దానిని వాక్కుతోగ్రహింప జాలకపోయెను, సః=ఆ భక్షకుడు, యత్ హ ఏనత్ = ప్రసిద్ధమగు నా

యన్నమును, వాచా అగ్రహైష్యత్=వాక్కుతో గ్రహింప గలిగినచో నైన, అన్నమ్ అభివ్యాహృత్య ఏవ='అన్నము అని వాక్కుతో ఉచ్చరించియే, అత్రప్స్యత్=తృప్తి నొందగలిగి యుండెడివాడు.

"తత్ ప్రాణే నాజిఘృక్ష త్త న్నాశక్నోత్
ప్రాణేన గ్రహీతుం, స యద్ధైనత్ ప్రాణే
నాగ్రహైష్య, దభిప్రాణ్య హైవాన్న మత్రప్స్యత్." ౪

తత్ ప్రాణేన అజిఘృక్షత్=ప్రాణముతో నా యన్నము గ్రహింప దలచెను. కాని, ప్రాణముతో గ్ర హిం ౦ ప జా ల క పోయెను. అట్లు గ్రహింపగలిగి యుండిన అన్నము నాఘ్రాణించుటచే తృప్తిగలుగవలసి యుండెను.

"త చ్చక్షుషాఽజిఘృక్షత్ తన్నాశక్నో చ్చక్షుషా
గ్రహీతుం; స యద్ధైన చ్చక్షుషాఽగ్రహైష్యద్,
దృష్ట్వా హైవాన్న మత్రప్స్యత్." ౫

సః=భక్షకుడు, 'తచ్చక్షుషా ...... అత్రప్స్యత్'=చక్షువుతో నన్నమును గ్రహింపనెంచెను. కాని నేత్రముతో తిన నశక్తుడయ్యెను. అట్లు చేయగలిగి యుండిన అన్నమును చూచిన మాత్రమున తృప్తికలుగ వలయును.

"త చ్ఛ్రోత్రేణాజిఘృక్షత్ త న్నాశక్నో చ్ఛ్రోత్రేణ
గ్రహీతుమ్, స యద్ధైన చ్ఛ్రోత్రే ణాగ్రహైష్య,
చ్ఛ్రుత్వా హైవాన్న మత్రప్స్యత్." ౬

భక్షకు డన్నమును చెవులతో దిన నుంకించెను. కాని తినజాలక పోయెను. అట్లు చేయగలిగి యుండిన అన్నము అను పదమును వినియే తృప్తిపడగలిగి యుండెడివాడు.

"తత్త్వ చాజిఘృక్షత్ తన్నాశక్నోత్ త్వచా
గ్రహీతుమ్, స యద్ధైన త్వచాగ్రహైష్యత్
స్పృష్ట్వా హైవాన్న మత్రప్స్యత్." ౭

అన్నమను త్వగింద్రియముతో గ్రహింపదలచి యశక్తుడయ్యెను. అట్లు గ్రహింపగలిగి యుండిన యెడల అన్నము స్పృశించియే తృప్తి నొందవలసి యుండును.

"తన్మనసాజిఘృక్షత్ తన్నాశక్నోన్మనసా
గ్రహీతుమ్, స యద్ధైన మనసాఽగ్ర
హైష్యద్ ధ్యాత్వా హైవాన్న మత్రప్స్యత్." ౮

భక్షకు డన్నమును మనస్సుతో దినదలచి యట్లు చేయజాలక పోయెను. మనస్సుతో నన్నమును దినగలిగియుండినచో అన్నమును ధ్యానించియే తృప్తిపడి యుండవలసినది.

"తచ్ఛిశ్నే నాజిఘృక్షత్ తన్నాశక్నోచ్ఛిశ్నేన
గ్రహీతుమ్, స యద్ధైన చ్ఛిశ్నే నాగ్రహైష్యత్
విసృజ్య హైవాన్న మత్రప్స్యత్." ౯

జననేంద్రియముతో నన్నమును తినదలచి యట్లు చేయజాలక పోయెను. అట్లు చేయగలిగి యుండినచో అన్నమును విసర్జించి - త్యజించియే తృప్తిపడగలిగి యుండును.

"తదపానే నాజిఘృక్షత్ తదావయత్
స ఏషోఽన్నస్య గ్రహో యద్ వాయు
రన్నాయుర్ వా ఏష యద్ వాయుః." ౧౦

అపానేన = ముఖమునుండి లోనికి పోవు వాయువుతో, తత్ = ఆ యన్నమును, అజిఘృక్షత్ = గ్రహింపదలచెను, తత్ ఆవయత్ =

దానిని గ్రహించెను. సః ఏషః=ఆ వాయువే, అన్నస్యగ్రహః=అన్నమును గ్రహించునది, ఏషః యత్ వాయుః = ఈ యన్నగ్రాహకమగు నపాన వాయువు, వా - ఆయుః=వికల్పితము—అనిశ్చితమగు ఆయువు— ప్రాణము గలది, అపానవాయువు చక్కగా పనిచేసినంతకాలము శరీరమున జీవనము ఉండును. లేనినా డది యుండదని భావము. వా = లేక, అన్నాయుః = అన్నము గ్రహించుటవలన జీవనము - ఆయుస్థితి కలది, యని యర్థము.

భక్షకుడు చివరకు అపానవాయువు ద్వారమున నన్నము గ్రహింప యత్నించి, దానిని గ్రహింపగలిగెను. ప్రాణులు భక్ష్యపదార్థములను ముఖ ద్వారమున శరీరములో క్రింది భాగమునకు బోవు వాయువు సాహాయ్యముతో ఉదరమున జేర్చును. కావున అపానము అన్నగ్రాహక మయ్యెను. ఈ యపానవాయువు బాగుగ పనిచేసినంతకాలము జీవన ముండును. కావుననే వాయువు అన : వా + ఆయుః=అనిశ్చితమగు నాయువు కలదియనియు, అన్నాయువు = అన్నమువలననే ఆయువు అనియు వాయు శబ్దమున కర్థములు చెప్పుదురు.

పరమేశ్వరుడు అంభసాదిలోకములను, అగ్న్యాది దేవతలను లోక పాలకులుగను సృష్టించి, యా దేవతలను క్షుత్పిపాసలతో సంయుక్తులం జేసెను. పిదప నాదేవతల యాకలి దీర్ప అన్నము కావలసివచ్చెను. అన్నము లేనిచో జీవన ముండదు. కావున అన్నమును సృష్టింపనెంచి, స్త్రీ శక్తిరూపమగు జలముతో పుంస్త్వ శక్తిరూప బీజమును సంయుక్త మొనర్చెను. అదియే పరమేశ్వరుని తపస్సు-లేక-ఈక్షణము నని యెంచ వలయును. అందువలననే మనువుకూడ-

"అప ఏవ ససర్జాదౌ తాసు బీజ మవాసృజత్"

'పరమేశ్వరుడు ప్రథమమున జలమును సృష్టించి యందు బీజము నుంచెను' అని చెప్పియున్నాడు.

"అద్భ్యః పృథివీ" 'జలమునుండి పృథివి'యేర్పడినదని తైత్తిరీయము నుడువుచున్నది. అంతేకాక యందే భృగు వల్లిలో "పృథివీ వా అన్నమ్" 'పృథివియే అన్నమనియు వర్ణింపబడినది. ఇట నైతరేయము నందు "తాభ్యః యా వై సా మూర్తి రన్నం వై తత్" 'ఆజలము నుండి పుట్టిన మూర్తియే అన్నమ'ని చెప్పబడినది.

ఇట్లు పరమేశ్వరునిచే సృష్టింపబడిన అన్నము తనను భక్షింప నున్న అగ్న్యాది దేవతలకు భయపడినట్లు ధ్వని చేయుచు నా దేవతలకు విముఖమై దూర మేగ సాగెను. అంతట భక్షకు డా యన్నమును వాగాదీంద్రియములతో భక్షింప యత్నించి యట్లు చేయజాలకపోయెను. వాగాదీంద్రియములతో నన్నము గ్రహింపగలుగు పక్షమున అన్నపదము నుచ్చరించి నను, అన్నమును ఆఘ్రాణించినను, చూచినను, వినినను, ధ్యానించినను, స్పృశించినను ప్రాణులకు తృప్తికలిగి యుండెడిది. అట్లు కలుగదు.కావుననే యాయా యింద్రియములు అన్నమును గ్రహింపజాలని వయ్యెనని భావము. తుదకు అపానము మూలమున భక్షకుడు అన్నమును శరీరాంతర్భాగమున జేర్పగలిగెనని యుపనిషత్తు చెప్పుచున్నది. ముఖద్వారముతో వాయు సాహాయ్యమున అన్నము ఉదరమున జేరుట లోకానుభవసిద్ధమే కదా!

లోకమున ప్రాణుల భక్ష్యపదార్థములు ప్రదానముగ పార్థివములై యుండుట మన మెఱుగుదుము. అట్లే వాయు జలాదులు జీవనహేతువులైనను పార్థివమగు నన్నభాగాదుల నొక్కటిగా గూర్చుటకును, శరీరాంతర్భాగమున జేర్చుటకును సహకరించుచు జీవనహేతువు లగును. కావున నవి గౌణములు - అప్రధానములని భావము. పాత్రమునందున్న జలము అగ్ని సంయోగముచే తప్తమై ధ్వనిచేయుచు బాగుగ కాగిన మీదట నావిరియై అగ్నికి దూరమేగ జూచును. కావున అగ్నిరూపవాక్కు తనను గ్రహింప నుంకింపగా అన్నము, 'నదత్ పరా జత్యజిఘాంసత్' 'ధ్వని చేయుచు - భయపడి - పరాఙ్ముఖమయ్యె' నని యుపనిషత్తునం దాలంకారి

కముగ వర్ణింపబడినది; మేఘజల మగ్నిసంయోగముచే భయపడి గర్జించుట లోక మెఱిగిన విషయము. మార్జాలాదులు తమ్ము భక్షింపరాగా భక్ష్యము లగు మూషికాదులు భయపడి యఱచుచు దూరముగ పరువిడును. ఇట్లు జడచేతనములందు మనకు గనబడు భయవ్యాకులతలకు కారణము భక్షకుల ప్రాబల్య మని యెంచదగును. సాధారణముగ లోకమున పురుషుడు భోక్త; స్త్రీభోగ్యయు నగుట సర్వవిదితము. కాని, భోక్త యెల్లయెడలభోక్తగాను, భోగ్యవస్తువు ఎల్లప్పుడు భోగ్యముగానే యుండవలయు నను నియమము లేదు. ఒకచో భోక్త మఱియొకయెడ భోగ్యముగాను, భోగ్యము భోక్తగాను మాఱవచ్చును. సర్గారంభమున వాగాదీంద్రియములచే నెవ్వరును అన్నము గ్రహింపజాలనందు వలననే నేడును, ఇకముందును వానితో నన్నము గ్రహింపజాల రనియే తోచుచున్నది.

"పృథివీ మర ఇతి, మృత్యు రపానో భూత్వా నాభిం ప్రావిశత్" 'పృథివి (మరము) మృత్యులోకమనియు, మృత్యువు అపానమై నాభిని ప్రవేశించె' ననియు నీ యుపనిషత్తునందు పూర్వము చెప్పబడినది. కావున అపానమునకు పార్థివపదార్థములకు విశేషసంబంధము కలదని తెలియుచున్నది.

"నాభిర్ నిరభిద్యత, నాభ్యా అపానో అపానాన్ మృత్యుః" 'నాభి భిన్న మయ్యెను; దానినుండి అపానము, అపానము నుండి మృత్యువు, ననియు పూర్వము చెప్పబడినది. దీనింబట్టి పృథివి, మరము, మృత్యువు నను పదములు సమానార్థకములగుచున్నవి. కావుననే అపానము అన్న గ్రహణ సాధనమైనది. అపానము, అన్నము రెండును పార్థివములే. వానిలో పరస్పరము గ్రాహ్యగ్రాహకభావము సహజము.

"అద్యతే అత్తి చ భూతాని తస్మా దన్నం త దుచ్యతే." 'తినబడును, తినును భూతములు, కావున అన్న మనబడును.' అనితైత్తిరీయోపనిషత్తు చెప్పుచున్నది. పృథివి(మట్టి)యే బహురూపములలో

వికృతమై భక్ష్యరూపమున ప్రాణులచే భుజింపబడుచున్నది. ఆ పృథివియే స్థావరజంగమ రూపమున నుండు మానవాది ప్రాణుల శరీరముల నెల్లప్పుడు తినుచుండును. నాశములైన దేహము లన్నియు మట్టియై పృథివియందే లీనమగునని భావము. పైన జూపిన రెండువిధము లయిన వ్యుత్పత్తితోను పృథివియే అన్నపదముచే జెప్పబడుట యసంగతము కాదు. ఇట్లు తిను నదియు తినబడునదియు అన్నమే యగుచున్నదని భావము.

శరీరమునం దగ్న్యాది దేవతలు, క్షుత్పిపాసలు ప్రవేశించిన మీదట జీవుడు శరీరమున బ్రవేశించు విధానము నుపనిషత్తు చెప్పుచున్నది.

"స ఈక్షత కథ న్విదం మదృతే స్యాదితి, స ఈక్షత
కతరేణ ప్రపద్యా ఇతి, స ఈక్షత యది వాచా
అభివ్యాహృతం; యది ప్రాణే నాభిప్రాణితం, యది
చక్షుషా దృష్టం, యది శ్రోత్రేణ శ్రుతం, యది త్వచా
స్పృష్టం, యది మనసా ధ్యాతం, య ద్యపానే నాభ్య-
పానితం, యది శిశ్నేన విసృష్ట మథ కోఽహ మితి." ౧౧

ఇదమ్=ఈ శరీరము, మదృతే=నేనులేకయే, కథం ను స్యాత్ = ఎట్లుండగలదు?, ఇతి=అని, సః = ఆ జీవుడు, ఈక్షత = ఆలోచించెను, కతరేణ ప్రపద్యే=రెంకు మార్గములలో నే మార్గమున ఈ శరీరమున బ్రవేశింతును!, ఇతి స ఈక్షత = అని యతడు మరల నాలోచించెను, వాచా=వాక్కుతో, యది అభివ్యాహృతం=పలుకబడినచో, ప్రాణేన యది అభిప్రాణితం=నాసికచే నాఘ్రాణింపబడినచో, చక్షుషా యది దృష్టం = నేత్రముతో చూడబడినచో, శ్రోత్రేణ యది శ్రుతం=చెవితో వినబడినచో, త్వచా యది స్పృష్టం=త్వగింద్రియముచే స్పృశింపబడినచో, మనసా యది ధ్యాతం=మనస్సుతో ధ్యానింపబడినచో, అపానేన యది అభ్యపానితమ్= అపానముచే అన్నము తినబడినచో, శిశ్నేన యది విసృష్టం = జననేంద్రి

ముచే రేతస్సు విడువబడినచో అథ అహం కః=అప్పుడు నే నెవడను? సః ఈక్షత=అని యత డాలోచించెను.

పూర్వము వర్ణించిన విధమున పరమేశ్వరుడు లోకములను సృష్టించి తదుపరి, లోకస్థితి కవసరములయిన అగ్ని, వాయువు మున్నగు దేవతలను సృష్టించి, వాని మూలమున జీవ నివాస యోగ్యమగు ఇంద్రియావయవములతోను, క్షుత్పిపాసలతోను గూడిన శరీరమును రచించెను. తట జీవు డాశరీరమును జూచి యిద్ది స్వయముగా నేమిచేయగలదు? శరీరమునందలి యింద్రియాదులవలన జరుగు భాషణాది వ్యాపారము రికొఱకు? శరీరాది పదార్థము లన్నియు భోగ్యములు. భోక్త లేనినాడు గ్యము నిరర్థకము. వాగింద్రియము తనకొఱకు భాషింపదు. నేత్రము కొఱకు జూడదు. ఇట్లే యితరేంద్రియములును తమకొఱకు స్వవ్యాపారముల నాచరింప వనుట లోకానుభవసిద్ధమే. కావున జీవుడు లేని శరీర వ్యాపారము లుండవు. జీవునిచే ప్రేరితములైన యింద్రియములు అతని కొఱకు స్వస్వ వ్యాపారముల నొనర్చును. కావున 'నే నెవడను? నాకిందు నమెక్కడ?' అని వితర్కించి జీవుడు శరీరమున ప్రవేశింపదలచెను. శరీరమున ప్రవేశించుటకు అధోమార్గము, ఊర్ధ్వమార్గము అని రెండేమార్గములు. ఆరెండింటిలో నేమార్గమున తాను శరీరమున ప్రవేశింప వలయునో ఆలోచింప వలసినవా డయ్యెను.

"స ఏత మేవ సీమానం విదా ర్యైతయా
ద్వారా ప్రాపద్యత సైషా విదృతిర్ నామ ద్వా
స్త దేత న్నాందనమ్, తస్య త్రయ అవసథా
స్త్రయః స్వప్నా అయ మావసథోఽయ
మావసథోఽయ మావసథ ఇతి." ౧౨

సః=ఆ జీవు డిట్లు వితర్కించి, ఏతమ్ ఏవ సీమానం విదార్య=సీమనుచీల్చి, ఏతయా ద్వారా=ఈద్వారముతోనే, ప్రాపద్యత=శరీరమున

జేరెను, సా ఏషా ద్వాః=ఆ యీ ద్వారము, విదృతిః నామ=విదృతి - (చీల్పబడినది - బ్రద్దలు చేయబడినది) అని ప్రసిద్ధిచెంచెను, తత్ ఏతత్ నాందనమ్=అందువలన నది నాందన మనబడును, తస్య=ఆ జీవునకు, త్రయః = మూడు, ఆవసథాః = స్థానములు, త్రయః స్వప్నాః=మూడు స్వప్నములు, అయమ్=ఇది, ఆవసథః = స్థానము, మూడు స్థానములు కావున ముమ్మాఱు నిర్దేశింపబడినది.

జీవుడు శరీరమున బ్రవేశింప నాలోచించి, శిరస్సును చీల్చి(విదార్య) యందు ప్రవేశించెను. జీవుడు శరీరమున బ్రవేశించిన యీద్వారము విదృతి యనబడును. నాందన మనియు నందురు. విదారణము చేయబడుటచే విదృతి యనియు, ముక్తజీవు లీ శరీరమును విడిచిపోవునపు డీ మార్గము ననే కపాలము బ్రద్దలుచేసికొని బ్రహ్మమును బొంది యానందింతురు. కావున నాందన మనియు పిలువబడు నని భావము. లోకమున నియ్యది బ్రహ్మరంధ్రమని వ్యవహరింపబడుట నెల్ల రెఱుగుదురు. జీవునకు ఇది యొక ఆవసథము. ఇదియొకటి, ఇదియొకటి యని ముమ్మాఱు అంగుళితో చూపి చెప్పినట్లు మూడుస్థానములు నిర్దేశింపబడినవి. ఆ మూడు స్థానములు కొందఱు మాతృ, పితృ, నిజ శరీరములని యందురు. మఱి కొందఱు శరీరమును మూడు భాగములు చేసి నీచములగు నాలోచనలుచేయు జీవుడు నిమ్నస్థానమునందు, మధ్యశ్రేణికి జెందిన ఆలోచనలు చేయువాడు మధ్య స్థానమునందును, ఉత్తమోత్తమములగు నాలోచనలు చేయువాడు ఉత్తమ స్థానమునందును నుండునట్లు చెప్పుదురు. నేత్రములు, కంఠము, హృదయము నను నీ మూడును జీవునకు విశేషనివాసస్థానము లని ముఖ్యముగా కొందఱందురు. జాగ్రదవస్థలో నేత్రములందును, స్వప్నావస్థలో కంఠము నందును, సుషుప్తిలో హృదయమునందును జీవు డుండునని కొందఱి యభిప్రాయము. బ్రహ్మోపనిషత్తునం దిట్లే వర్ణించుట జూడనగును.

"నేత్రే జాగరితం విద్యాత్ కంఠే స్వప్నం సమావిశేత్
సుషుప్తం హృదయస్థం తు; తురీయం తద్విలక్షణమ్."

జీవుడు శరీరమున నున్నపుడు జాగరణాద్యవస్థలలో నెం దున్నను బ్రహ్మజ్ఞానము కలుగనంతవఱకు నిద్రలో నున్నవానివలెనే యుండును. కావుననే యుపనిషత్కర్త యీ మూడవస్థలను (త్రయః స్వప్నాః) స్వప్నములనియే వర్ణించినాడు. నిద్రలో నున్న మానవు డేమియు నెఱుగనట్లు బ్రహ్మజ్ఞానము కలుగనంతవఱకు జాగ్రదవస్థలో నుండియు నిద్రించు వానితో సమానమే యని భావము.

"స జాతో భూతా న్యభివ్యైక్షత్
కి మిహాన్యం వావదిష దితి
స ఏత మేవ పురుషం బ్రహ్మ
తతమ మపశ్య దిద మదర్శ మహో౩." ౧3

సః=ఆ జీవుడు, జాతః=జాగృతుడై - ప్రతిబుద్ధుడై-ఆత్మజ్ఞానియై, భూతాని=ప్రాణులను, అభివ్యైక్షద్=వివేకముతో జూచుచు, ఇహ = ఈ జగత్తునందు, అన్యం = ఇతరునితో, కిం వావదిషత్ = ఏమి యధికము చెప్పును? చెప్పడని భావము. సః = అతడు, ఏతం పురుషం తతమమ్ బ్రహ్మఏవ=తన కభిముఖముగా పూర్ణమై వ్యాపకమై యున్న బ్రహ్మమునే, ఇదమ్ అదర్శమ్ అహో౩ ఇతి=ఇదిగో చూచితిని ఆశ్చర్యకరముగానున్నది, అని, అపశ్యత్=చూచును.

జీవు డీ శరీరమున బ్రవేశించి దానితో లోకమున బ్రవర్తించుచుండును. బ్రహ్మమును - పరమేశ్వరుని ఎఱుగనంతకాలము ప్రకృతిలీనుడై జీవుడు నిద్రాపన్నుడై యున్నట్లుండును. ఇట్లుండ నీశ్వరానుగ్రహమువలననో, జీవన్ముక్తులైన యాచార్యుల ప్రబోధమువలననో జీవుడు ప్రతిబుద్ధు డగును. ఆత్మానాత్మ వివేకి యగును. జగత్తున వర్తించు ప్రాణులను దుఃఖమగ్నులుగా గుర్తించును. సుఖము లనుభవించువారు కూడ

పరమేశ్వరు నెఱుగక బ్రహ్మానందానుభూతినుండి వంచితు లయినందున నతనికి ముఃఖభూయిష్ఠములుగానే గోచరింతురు. తాను శుద్ధాంతఃకరణుడై వివేకముతో బ్రహ్మమును సాక్షాత్కారము చేసికొని యితరులతో నేమియు విశేషముగ భాషింపడు. మౌనియై పరమేశ్వరు నుపాసించును. అతనికి పరమేశ్వరుడు అంతటను పూర్ణుడై వ్యాపించి యన్నింటిని మించినవాడై సాక్షత్కరించును. అప్పు డతడు 'అహో ఆశ్చర్యము, ఇది బ్రహ్మము, అన్నింటికంటె గొప్పది. దీనిని మించిన దొండును లేదు' అని చకితుడై బ్రహ్మమును దర్శించును. ఇట నుపనిషద్వాక్యమునందు 'తతతమమ్' అనుటకు బదులు 'తతమమ్' అనివాడ బడినది. తతతమ మన దానికిమించిన వ్యాపకవస్తువు మఱియొండు లేదని యర్థము. 'అహో ౩'పదమునకు తదుపరి ఉన్న మూడంకె 'ఓకారము ప్లుతమని తెలుపుటకు వాడబడినది. అందువలన నాత్మదర్శన మొనర్చు వానికి కలుగు ఆశ్చర్యమునకు మేర యుండదని తెలియనగును. కావుననే 'ఆశ్చర్యవత్ పశ్యతి కశ్చి దేనమ్' అని యన్యత్ర వర్ణింపబడినది.

"తస్మా దిదంద్రో నా మేదంద్రో హ వై నామ
త మిదంద్రం సంత మింద్ర మిత్యాచక్షతే
పరోక్షేణ పరోక్షప్రియా ఇవ హి దేవాః
పరోక్షప్రియా ఇవ హి దేవాః." ౧౪

తస్మాత్=బ్రహ్మమును జూచి పరితుష్టి నొందినందువలన, బ్రహ్మము, ఇదంద్రః నామ = ఇదంద్రమను నామము గలది, హ వై = నిశ్చయముగ, ఇదంద్రఃనామ=ఇదంద్రమనిప్రసిద్ధికలది, తమ్ + ఇదంద్రం సంతం=అందువలన ఇదంద్రమను నా బ్రహ్మమును, ఇంద్రమ్ ఇతి = ఇంద్రమని, పరోక్షేణ=పరోక్షముగా, ఆచక్షతే=చెప్పుదురు, హి=కారణ మేమన, దేవాః = విద్వాంసులు, పరోక్షప్రియాః ఇవ=పరోక్షమునందు ప్రేమ గలవారివలె నుందురు.

'పరోక్షప్రియాః ఇవ హి దేవాః' అను నీవాక్యము అధ్యాయ సమాప్తిని దెలుపుటకై రెండుమారులు ప్రయోగింపబడినది.

బ్రహ్మసాక్షాత్కారము పొందిన వ్యక్తి 'ఇద మదర్శమ్' 'ఇది చూచితిని' - 'పరితుష్టి నొందితిని' అని యనును. అందువలన బ్రహ్మము ఇంద్ర మనబడును. ఇదంద్రమని ప్రసిద్ధిబొందిన యా బ్రహ్మమును జ్ఞానులు ఇంద్రమ్ అందురు. 'ఇదం + అదర్శమ్' అను నీ రెండు పదము లను కలిపి, రెండవపదములోని రెండు అకారములు శవర్ణము విడిచి పలికిన (ఇదం + అ ద్ అ ర్ శ్ అ మ్ =) ఇదంద్రమ్ అగును. ఇట్లు 'ఇదమ్ + అదర్శమ్' అను రెండుపదములు 'ఇదంద్రమ్' కాగా, విద్వాం సులు 'ఇదంద్రమ్'లోని మధ్యనున్న (ద) ను విడిచి 'ఇంద్రమ్' అన దొడగిరి. కారణమేమన విద్వాంసులు పరోక్షప్రియులు. 'ఇదంద్రమ్' ప్రత్యక్షబోధకము. ఇంద్రమ్ అనుపదము పరోక్షార్థకము. పదార్థనామములు పదార్థములను ప్రత్యక్షముగా దెలుపును. అందువలననే పెద్దలను గురించి చెప్పునపుడు వారి నామములను సాక్షాత్తుగ నుచ్చరింపక పెద్దలు, ఆచార్యులు, స్వాములు మున్నగు పదములు వాడుదురు.

ఈ తృతీయ ఖండమున (౧౧-౧౩) గల ౧౧,౧౨,౧౩ వాక్యము లందు గల (సః) తత్ పదమునకు శ్రీశంకర స్వాములు సః=సృష్టికర్త అని యర్థముచెప్పి, శరీరమున సృష్టికర్తయగు పరమేశ్వరుడే ప్రవేశించి నట్లు భాష్యము వ్రాసియున్నారు. కాని, ఈ ప్రకరణమునందలి తత్ పదమునకు సృష్టికర్త-పరమేశ్వరుడని యర్థము చెప్పుట సంగతముకాదు. కారణమేమన, ఈ ప్రకరణమునందలి (స ఏత మేవ పురుషం బ్రహ్మ తతమ మపశ్యత్) అను నీపదుమూడవ వాక్యమునందలి 'సః' అను తత్పద మునకు ఈశ్వరుడు-బ్రహ్మము-సృష్టికర్త యని అర్థము చెప్పినచో (సః= సృష్టికర్త-బ్రహ్మము, ఏతమేవ పురుషం బ్రహ్మ తతమమ్ అపశ్యత్ = ఈ పూర్ణము, గొప్పదియు, వ్యాపకము నగు బ్రహ్మమును చూచెను.)

'సృష్టికర్త వ్యాపకుడు, పూర్ణుడునగు పరమేశ్వరుని,చూచెను'అని యగును. అప్పుడు చూచెను అనుక్రియకు కర్త, కర్మ రెండును సృష్టికర్తయే యగును. బ్రహ్మము బ్రహ్మమునే దర్శించె ననుటలో విశేషమేమి? కావున ఈ ప్రకరణములోని 'సః' అను తత్పదమునకు సృష్టికర్త యని కాక జీవుడు అని యర్థము చెప్పిన 'జీవుడు పూర్ణమగు బ్రహ్మమును దర్శించెను' అని యగును. అప్పు డెట్టి దోషమును ఉండదు. కాబట్టి శ్రీశంకరుల భాష్యము మూలము ననుసరింపలే దనక తప్పదు.

శ్రీ శంకరాచార్యుల భాష్యవాక్యముల నిట పొందుపఱచుచున్నాము. పాఠకులు స్వయముగా నాలోచింతురు గాక!

"అస్మిన్ చతుర్థేఽధ్యాయ ఏష వాక్యార్థః, జగదుత్పత్తి స్థితి ప్రలయకృ దసంసారీ సర్వజ్ఞః సర్వశక్తిః సర్వవిత్ సర్వ మిదం జగత్ స్వతోఽన్యద్ వస్త్వంతర మనుపాదా యైవ ఆకాశాదిక్రమేణ సృష్ట్వా స్వాత్మప్రబోధనార్థం సర్వాణి చ ప్రాణాదిమచ్ఛరీరాణి స్వయం ప్రవివేశ, ప్రవిశ్యచ స్వమాత్మానం యథా భూతమ్ ఇదం బ్రహ్మాస్మీతి సాక్షాత్ ప్రత్యబుధ్యత, తస్మాత్ స ఏవ సర్వశరీరే ష్వేక ఏ వాత్మా నాన్య ఇతి...."

శాం. భా.

"బ్రాహ్మణములోని యీ చతుర్థాధ్యాయమునందలి వాక్యార్థ మిది. జగదుత్పత్తి స్థితిలయములకు కర్త, అసంసారి, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వవిదుడు తనకంటె భిన్నమగు మఱియొక వస్తువును గ్రహింపకయే యాకాశాదిక్రమమున నీ జగత్తును సృష్టించి, స్వాత్మప్రబోధనార్థము ప్రాణాదులతో గూడిన సర్వశరీరములందును స్వయముగ బ్రవేశించెను' ప్రవేశించి తనను 'ఇదమ్ బ్రహ్మాస్మీతి' 'ఇదిగో బ్రహ్మము నైతిని. అని సాక్షాత్తుగ నెఱింగెను. కావున సర్వశరీరములందును ఆత్మ యొక్కటియే. మఱియొండు లేదు."

ఈ శాంకరభాష్య వాక్యములను జదివిన పాఠకులకు పరమేశ్వరుడే సర్వ శరీరములందును ప్రవేశించినట్లు బోధపడును. ఇంతేకాక, పరమేశ్వరుడు స్వాత్మప్రబోధముకొఱకు జగత్తును సృష్టించి శరీరములందుప్రవేశించినట్లు శంకరస్వామి లనుచున్నారు. ప్రవేశించిన తదుపరి పరమేశ్వరుడు 'ఇదం బ్రహ్మాస్మి' 'ఇదిగో నేను బ్రహ్మమును' అని గుర్తించినాడట. ఈవాక్యములను జదివినపుడు పాఠకుల కేమి బోధపడును? సృష్టికర్తయగు పరమేశ్వరున కీ జగత్తును సృష్టింపక పూర్వము తాను బ్రహ్మమని తెలియదనియు, జగత్తును సృష్టించి ప్రాణుల శరీరములలో బ్రవేశించిన మీదట నతనికి తన బ్రహ్మత్వము బోధపడిన దనియు కదా శంకరులు చెప్పుచున్నారు; సృష్టికి పూర్వము బ్రహ్మము తన్ను దా నెఱుగదా? సర్వజ్ఞమగు బ్రహ్మమున నీ యజ్ఞత్వ మెక్కడిది? స్వాత్మప్రబోధనార్థము ఈశ్వరుడు సృష్టిగత శరీరములందు బ్రవేశించుటలో నర్థమేమి? వ్యాపకమగు బ్రహ్మము శరీరములను సృష్టించిన తదుపరి వానిలో ప్రవేశించె ననుట కర్థ మేమి? బ్రహ్మము అజ్ఞము, అవ్యాపకము నగుచో పై వాక్యముల కర్థముండును. అన్యథా వాని కర్థము దురూహ్యము.

సృష్టికర్త వస్త్వంతరమును గ్రహింపకయే ఆకాశాదులను సృష్టించెనట: అనగా నర్థ మేమి? లేని దానిని సృష్టించె ననియా? లేనిది సృష్టింపబడు టెట్లు? అభావమును భావ మెట్లు చేయగలడు?

శంకరాచార్యుల కీ ప్రకరణమున కొన్ని సంశయములు కలుగక పోలేదు. వారు తమ సంశయముల నిట్లుల్లేఖించిరి. చూడుడు :

సంశ :- "సర్వగతస్య సర్వాత్మనో బాలాగ్రమాత్రమప్యప్రవిష్టం నాస్తీతి కథం సీమానం విదార్య ప్రాపద్యత పిపీలికేవ సుషిరమ్."

'పరమాత్మ సర్వగతము, సర్వాత్మము. కావున వెండ్రుక చివరిభాగమంతైనను పరమాత్మ ప్రవిష్టము కానిది లేదు. అట్టియెడ శిరస్సును చీల్చి

తద్వారమున చీమ బెజ్జమున బ్రవేశించినట్లు పరమాత్మ, శరీరమునందు బ్రవేశించె' ననుట పొసగునా?

సమా:-"న స్వల్ప మిదం చోద్యమ్, బహుచాత్ర చోదయి తవ్యమ్, అకరణః సమీక్షిత; అనుపాదాయ కించిల్లోకా నసృజత, అద్భ్యః పురుషం సముద్ధృత్య అమూర్ఛయత్, త స్యాభిధ్యా నాత్ ముఖాది నిర్భిన్నమ్; ముఖాదిభ్యశ్చాగ్న్యాదయో లోక పాలాః, తేషా మశనా పిపాసాది సంయోజనమ్; తదాయతన ప్రార్థనమ్; తదర్థం గవాది ప్రదర్శనమ్; తేషాం చ యథాయ తనం ప్రవేశనమ్; సృష్ట స్యాన్నస్య పలాయనమ్; వాగాదిభి స్తజ్జిఘృక్షా; ఇత్యేతత్ సర్వం సీమావిదారణ ప్రవేశసమ మేవ." శాం. భా.

'ఈ సందేహము స్వల్పమే. ఇంకను నిట సందేహింప వలసిన దెంతో కలదు. సృష్టికర్త సాధనము లేక సమీక్షించుట, ఏమియుగ్రహింప కయే లోకములను సృష్టించుట, నీటినుండి పురుషుని దీసి యతనిని మూర్ఛింపజేయుట, అభిధ్యానమువలన ముఖాది నిర్భిన్నమగుట, అందుండి అగ్న్యాది లోకపాలకులు జనించుట, వారిని క్షుత్పిపాసలతో జోడించుట, వానికి స్థానములు కావలయునను కోరిక, అందులకు గవాదులను ప్రదర్శిం చుట, వానికి తగిన స్థానములందు ప్రవేశించుట, సృష్టింపబడిన అన్నము పలాయనము చిత్తగించుట, దానిని వాగాదులు గ్రహింప నుంకించుట మన్నగు విషయము లన్నియు సందేహింపదగినవియే.

సంశ :- "అస్తు తర్హి సర్వమే వేద మనుపపన్నమ్?"

'అటులయిన నిది యంతయు అనుపపన్నమే — సరిగా లేదనియే చెప్పుదము?'

సమా :- "న; అత్రాత్మావబోధమాత్రస్య వివక్షితత్వాత్ సర్వో ప్యయ మర్థవాద ఇత్యదోషః" శాం. భా.

'సర్వము సరితా దనరాదు. ఇట కేవలము ఆత్మావబోధము వివక్షిత మైనందున నిది యంతయు అర్థవాదము మాత్రమే. కావున దోష మావంతయు లేదు.'

శంకరాచార్యు లిట యుద్భావించిన అనుపపత్తులు-దొసగులు, వానికి వారుచెప్పిన సమాధానములు పాఠకులకు బాగుగ బోధపడి యుండుననియే యెంచుచున్నాము. ఉపనిషత్తునవర్ణించిన సృష్టిక్రమమంతయుఅర్థవాదమట! దానిమూలమున ఆత్మావబోధము కలుగజేయుటయే గ్రంథకర్తకు వివక్షిత మట! శంకరుల వాదమునుబట్టి చూచిన ఉపనిషత్కర్త చెప్పిన విషయము లన్నియు అసంగములు, అనుపపన్నములు - హేతుబద్ధములు కానివి. అట్టి హేతుబద్ధముకాని అర్థవాదముతో ఆత్మావబోధము కలుగజేయ నెంచినాడట ఉపనిషత్కర్త! ఈ యాత్మావబోధ మెవరికి? పాఠకులకా? పరమేశ్వరునకా? ఎవరికైనను హేతుబద్ధము కాని యర్థవాదముతో ఆత్మావబోధ మెట్లు కలుగును? శంకరుల సమాధాన మెంత వింతగానున్నదో చూడుడు

ఈ సమాధానముతో శంకరాచార్యులు స్వయముగా తృప్తినొందిరా లేదు. వారు తమ సమాధానములోని నిస్సారతను గ్రహింపక పోలేదు వా రనల్పబుద్ధిమంతులు. వారి తర్కబుద్ధి నందుకొనుట సామాన్యులకు శక్యముకాదు. బుద్ధిమంతు లెవరైనను తమ వాదమున గల యసారతను గ్రహింపగలరేమో యని కాబోలు మఱియొక సమాధాన మిట్లు భాషించి యున్నారు.

సమా:- "మాయావివద్ వా, మహామాయావీ దేవః సర్వజ్ఞః సర్వశక్తిః సర్వమేతచ్చకార, సుఖావబోధనప్రతిపత్త్యర్థంలోకవదాఖ్యాయికాదిప్రపంచఇతియుక్తతరః పక్షః." శాం భా

'మాయావి (గారడివాడు) వలె నని సమాధానము చెప్పిన ఇంకను బాగుండును. అది యెట్లన : మహామాయావియు, సర్వజ్ఞుడు, సర్వశక్తి యుక్తుడు నగు పరమేశ్వరు డిది యంతయు చేసెను. సులభముగ

తెలియుటకొఱకు లోకమునందువలె నీ కథాకల్పన మని చెప్పినచో శ్రేష్ఠ సమాధాన మగును.'

శ్రీశంకరస్వాములు తాముచెప్పిన మొదటి సమాధాన మంత బాగుగ లేదని యెంచి, అంతకంటెను ఎక్కువ మంచి సమాధానము చెప్పి యున్నారు. ఈ సమాధానమునందలి శ్రేష్ఠతను గుఱించి యే మనవలయునో తోచకున్నది. పరమేశ్వరుడు మహామాయావి - పెద్ద గారడి వాడట! గారడివాడు వీథిలో తనకొక రంగస్థల మేర్పఱచుకొని యేవో గారడి విద్యలను ప్రదర్శించునట్లు, (అదియు పొట్టకూటికొఱకు) పరమేశ్వరు డీ ప్రపంచమును సృష్టించినాడట. ఆహా! ఎంతసముచితముగా నున్నదీ సమాధానము? ఈ మహామాయావి యెవరికొఱకు, ఎందులకు, ఈమాయా ప్రపంచమును సృష్టించినట్లు? గారడివాడు తన విద్యను ప్రదర్శించుటలో ప్రయోజన మున్నది. చూచి చకితులగు వా రున్నారు. ఇట నీ మహామాయావి తప్ప శంకరులదృష్టిలో మఱియొక రెవ్వరు లేరుకదా! అట్టి యెడల నీ మహామాయావి జగత్తు నెందులకు సృష్టించినాడు? ఎవరిని సంతోషింపజేయుటకు? సమాధానము మృగ్యము. పరమేశ్వరుడు తన కొఱకే గారడితనము వహించునా? గారడివానివలె నటింపకున్న నతని కాత్మావబోధము కలుగదా? ఆత్మావబోధమేకదా జగత్‌సృష్టికి ప్రయోజనము?

పరమేశ్వరుని గారడివానితో బోల్చుటలో శ్రీ శంకరుల యభిప్రాయ మేమి? గారడివాడు లేనిదానిని పుట్టించునా? కుందేటికి కొమ్మును, గొడ్రాలికి బిడ్డను గలిగించునా? కలిగింపనేరడు. పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడు కాబట్టి అభావమునుండి జగత్తును సృష్టించునని శంకరు లెంచుచున్నారేమో! సర్వశక్తిమత్త—లేనిది పుట్టించుట కాదు. అభావమును భావము చేయుట కాదు. ఉనికిలేనిదాని కునికి నిచ్చుట కాదు. ఉపాదానకారణము లేకయే కార్యవస్తువును నిర్మించుటయు కాదు. అయిన మఱియేమి? అందు రేని వినుడు: భగవంతుడు సర్వశక్తిమంతుడే. అందు సందియము లేదు.

అతని సర్వశక్తిమత్త కారణరూపమున నున్న సూక్ష్మప్రకృతిని స్థూల జగత్తుగా మార్చుటలో సాధనాంతరము నపేక్షింపకుండుటయే. లోకమున కర్తకు సాధనసంపత్తి సహకార మవసరమగును. కుమ్మరి మట్టిని కుండగా మార్చుటకు దండ చక్రచీవరాది సాధనము లవసరము లగును. సాలెవాడు తంతువులను వస్త్రముగా మార్చుటకు మగ్గము మున్నగు సాధనము లవసరము లగును. పరమేశ్వరుడు ప్రకృతిని వికృతిగా మార్చుటకు ఇతర సాధనముల నపేక్షింపడు. జగత్తును పాలించుటకుగాని, విలయము చేయుటకు గాని సాధనాంతరములను గోరడు. అదియే యతని సర్వశక్తిమత్త్వము ఈక్షణమాత్రమున ప్రకృతి వికృతియై, స్థితిని బొంది యొకప్పుడు విలయ మందును.

కావున పరమేశ్వరుడు మహామాయావి యగునో కాదో కాని, శ్రీ శంకరాచార్యులు మాత్రము మాయావు లనక తప్పదు. వారి వాదము మాయావాదము. దానింగూర్చి వ్రాయవలసిన దెంతయో యున్నను నిట దిఙ్మాత్రముగ కొన్నిమాటలు వ్రాసి మిగిలినది చదువరుల యూహకు విడుచుచున్నాము.

తృతీయఖండము సమాప్తము



# ద్వితీయాధ్యాయము

"పురుషే హ వా అయ మాదితో గర్భో భవతి
య దేతద్ రేతః త దేతత్ సర్వేభ్యోఽఙ్గేభ్య
స్తేజః సంభూత మాత్మన్యే వాత్మానం
బిభర్తి, తద్ యదా స్త్రియాం సించ
త్యథైన జ్జనయతి తదస్య ప్రథమం జన్మ" ౧

పురుషే =పితృశరీరమునందు, హ వా=నిశ్చయముగ, అయమ్= ఈ జీవుడు, ఆదితః=మొదట, గర్భః భవతి=గర్భమగును, యత్ ఏతత్ రేతః=శరీరమునందలి యీ వీర్యము, తత్ ఏతత్ సర్వేభ్యః అంగేభ్యః = సర్వాంగములనుండి, సంభూతం=పుట్టిన, తేజః = తేజస్సు - సారము. అది, ఆత్మని ఏవ=తనయందే, ఆత్మానం=జీవుని, బిభర్తి=ధరించును, తత్=ఆ వీర్యమును, యదా=ఎప్పుడు, స్త్రియాం=స్త్రీయందు, సించతి = ప్రవేశింపజేయునో, అథ=అప్పుడు - తరువాత, ఏతత్=ఈ వీర్యమును, జనయతి=పుట్టించును, తత్ అస్య ప్రథమం జన్మ=అది యీ జీవునకు మొదటి జన్మ.

సామాన్యముగ స్త్రీలు గర్భవతు లగుట మన మెఱుగుదుము. కాని, వాస్తవమున గర్భధారణము ప్రథమమున పురుష శరీరమున నేర్పడును. వీర్యమువలన గర్భ మేర్పడునుగదా: ఆ వీర్యము పురుషదేహసారమే. అది పురుషుని రక్తరక్తాదిదేహాంశముల సారము. పురుషుని ప్రత్యవయవ తేజస్సు - సారభూతతత్త్వము. అదియే సంతానముగ జన్మించు జీవుని దేహమునకు కారణము, రేతస్సు దేహసార మని సుశ్రుతము చెప్పుచున్నది.

"యథా పయసి సర్పిస్తు గుడ శ్చేక్షౌ రసో యథా
శరీరేషు తథా శుక్రం నృణాం విద్యాత్ భిషగ్వరః." సు.

'పాలలో నేయి, చెఱకురసమున బెల్లమువలె మానవులదేహమున వీర్యము సారముగా నుండును.' అను నీ సుశ్రుతవాక్యమునుబట్టి వీర్యము సర్వాంగసార మనుట నిశ్చితము. ఈ వీర్యమువలననే స్త్రీలలో గర్భ మేర్పడును. కావున గర్భము మొదట పురుషునం దేర్పడు ననుట వింతకాదు. పురుషుడు తన దేహమున వీర్యమును రక్షించి తన్ను తాను ధరించినవా డగును. తదుపరి యా వీర్యము స్త్రీయందుంచి తననే - తన శరీరమునే స్త్రీయందు జనింపజేసినవా డగును. ఇదియే యతని ప్రథమజన్మ. తండ్రియే పుత్రుడుగా జన్మించు ననుటలో యభిప్రాయ మిదియే.

"తత్ స్త్రియా ఆత్మభూయం గచ్ఛతి
యథా స్వ మంగం తథా తస్మా దేనాం న హిన స్తి.
సాఽస్యై త మాత్మాన మత్రగతం భావయతి." ౨

తత్=ఆ రేతస్సు, స్త్రియాః=స్త్రీకి, స్వం అంగం యథా = తన శరీరావయవ మెట్లో, తథా=అట్లు, ఆత్మభూయం గచ్ఛతి=ఆత్మభావమును బొందును, తస్మాత్=అందువలన, ఏనామ్ = ఆ స్త్రీని, న హిన స్తి = హింసింపదు, సా=ఆ స్త్రీ, అత్ర = తన శరీరమునందు, గతం = ప్రవేశించిన, అస్య=రేతస్సు తనయందుంచిన పురుషునియొక్క, ఏతం ఆత్మానం=రేతోరూపమగు నాత్మను - శరీరమును, భావయతి=పోషించును.

పురుష శరీరమునకు సారభూతమైన రేతస్సు స్త్రీయందుంచబడినప్పుడది యా స్త్రీ శరీరమున కొక యంగముగా నగును. స్త్రీలకు స్తనా ద్యవయవములు వారి శరీరముల కంగములై బాధాకరములు కానట్లు రేతస్సు కూడ వారి శరీరమున కంగభూతమై బాధ గలిగింపదు. స్త్రీ శరీరమున నేర్పడు గర్భమామెకు కష్టము కలిగింపదని భావము. స్త్రీ తన గర్భాశయమున ప్రవేశించిన పురుషశరీర సారమగు రేతస్సును ఆత్మతో గూడి యున్నట్లు తెలిసికొని, యా గర్భమునకు హాని కలుగకుండునట్లు పథ్యపానములు చేయుచు గాపాడును.

"సా భావయిత్రీ భావయితవ్యా భవతి, తం
స్త్రీ గర్భం బిభర్తి; సోఽగ్ర ఏవ కుమారం
జన్మనోఽగ్రేఽధిభావయతి, స యత్
కుమారం జన్మనోఽగ్రేఽధిభావయ
త్యాత్మాన మేవ తత్ భావయ త్యేషాం
లోకానాం సంతత్యా ఏవం సంతతా హీమే
లోకా స్త దస్య ద్వితీయం జన్మ" 3

సా=ఆ గర్భిణీస్త్రీ, భావయిత్రీ = గర్భమును పోషించుచున్నదై, భావయితవ్యా భవతి=పోషింపబడదగిన దగుచున్నది, స్త్రీ=గర్భిణీ, తం గర్భం=ఆ గర్భమును, బిభర్తి = ప్రసవపర్యంతము ధరించును, సః = అతడు—పతి, అగ్రే ఏవ=ముందుగానే, స్త్రీయం దుంచిన, కుమారం = కుమారుని, జన్మనః అగ్రే=ప్రసవానంతరమున, అధిభావయతి=జాతకర్మ నామకరణాది సంస్కారములతో వర్ధిల్ల జేయును, సః=అతడు, కుమారం= కుమారుని, జన్మనః అగ్రే=జన్మానంతరమున, య దధిభావయతి=వర్ధిల్లి జేయుట యనునది యేది కలదో, తత్ = అది, ఆత్మాన మేవ = తననే, భావయతి=వర్ధిల్లజేయుచున్నా దన నగును, ఏషాం లోకానాం=ఈ కనబడు లోకులయొక్క, సంతత్యా=సంతానముతో, ఇమే లోకాః=ఈ జనులెల్లరు, ఏవం సంతతాః=ఇట్లు తెంపులేనివా రగుచున్నారు, తత్ అస్య ద్వితీయం జన్మ=ఈజీవున కది రెండవ జన్మము.

స్త్రీ గర్భమును చక్కగా వర్ధిల్లజేసి సంతానమును గనును. పుట్టిన సంతానమునకు జాతకర్మాది సంస్కారములను యథోచితముగ జరిపి తండ్రి పోషించును. జనకుడు సంతానమును పోషించుట తనను పోషించుటయే యగునని భావము. ఇట్లు పురుషశరీరగత రేతస్సు స్త్రీయందు జేరి, యామె గర్భమునుండి బయట బడుటయే జీవునకు రెండవ జన్మము.

"సోఽస్యాయ మాత్మా పుణ్యేభ్యః కర్మభ్యః
ప్రతిధీయతే; అథా స్యాయ మితర ఆత్మా కృతకృత్యో
వయోగతః ప్రైతి, స ఇతః ప్రయన్నేవ
పున ర్జాయతే, త దస్య తృతీయం జన్మ." ౪

సః అయమ్ ఆత్మా=ఆ జన్మించిన ఆత్మ - కుమారుడు, అస్య = ఈతండ్రియొక్క, పుణ్యేభ్యః కర్మభ్యః=పుణ్యకర్మలకు, ప్రతిధీయతే = ప్రతినిధి యగును. తండ్రిచేయు పుణ్యకర్మలను పుత్రుడు కొనసాగింపవలసినవా డగునని భావము. అథ = తదుపరి, అస్య = ఈ జన్మించిన కుమారునియొక్క, అయం ఇతరః ఆత్మా=మఱియొక దేహరూపుడైన తండ్రి, కృతకృత్యః=కృతకృత్యుడై - చేయవలసిన పనులు చేసినవాడై, వయోగతః=వృద్ధుడై, ప్రైతి=మరణించును, సః = ఆ పుత్రుడు, ఇతః ప్రయన్ ఏవ = దేహమును విడువకముందే, పునః జాయతే=మరల జనించును. తన భార్యయందు పుత్రరూపమున గర్భస్థు డగునని భావము. తత్ అస్య తృతీయం జన్మ=అది యీ జీవునకు మూడవ జన్మము.

(సః ఇతః ప్రయన్ ఏవ పునః జాయతే – అతడు మరణించిన వెంటనే మరల జనించుననియు చెప్పుదురు.)

"త దుక్త మృషిణా 'గర్భే ను స న్నన్వేషా
మవేద మహం దేవానాం జనిమాని విశ్వా
శతం మా పుర ఆయసీ రరక్ష న్నధ శ్యేనో
జవసా నిరదీయమ్.'- ఇతి గర్భ ఏ వైత
చ్ఛయానో వామదేవ ఏవ ముువాచ." ౫

ఋషిణా = వేదముచే, తత్ ఉక్తమ్=అది యిట్లు చెప్పబడినది, ను=ఆశ్చర్యబోధకము, గర్భే సన్=గర్భమునం దున్నవాడనై, ఏషామ్ దేవానామ్=ఈ యగ్న్యాది దేవతలయొక్క, విశ్వా జనిమాని = సమస్త

జన్మములు, అహం అవేదమ్=నే నెఱిగితిని, మా = నన్ను, శతమ్ = నూఱు—అనేకములైన, ఆయసీః=లోహమయములైన వానివంటి, పురః= పురములు - శరీరములు, అరక్షన్ = రక్షించినవి, అథ=అనంతరము, శ్యేనః=శరీరమునుండి వెలువడు స్వభావము గలవాడనై, జవసా = వేగ ముతో, నిరదీయమ్=బయటబడితిని, ప్రాకృతమగు నీ జడదేహమునుండి చేతనుడ నగుటచే శరీరమునం దుండియు వేఱు చేయబడితిని, అని వామ దేవర్షి గర్భమున నున్నపుడే యిట్లు చెప్పియున్నాడు.

"స ఏవం విద్వాన్ అస్మాచ్ఛరీరభేదా దూర్ధ్వ
ముత్క్రమ్య, ష్యాముష్మిన్ స్వర్గే లోకే సర్వాన్
కామా నాప్త్వా అమృతః సమభవత్ సమభవత్." ౬

ఇతి చతుర్థఖండః, ఇ త్యైతరే యారణ్యకే
ప ం చ మ ఉపనిషత్సు చ ద్వితీయాధ్యాయః
స మా ప్తః

సః=అతడు - వామదేవుడు - ప్రశస్తదేవుడు (ప్రశస్తములైన మోక్షహేతువులైన—శుద్ధములైన-అగ్ని ప్రభృతులైన శరీరగత దేవతలు కలవాడని భావము.) ఏవం విద్వాన్=ఇట్లు తెలిసికొనినవాడై, అస్మాత్ శరీరభేదాద్=ఈః శరీరమునుండి, ఊర్ధ్వమ్=పైకి, ఉత్ క్రమిష్య=వెడలి, అముష్మిన్ స్వర్గే లోకే=పరోక్షమగు అనందమును పొందింపజేయు పర బ్రహ్మమునందు, సర్వాన్ కామాన్ ఆప్త్వా=సర్వకామములను బొంది, అమృతః సమభవత్=మృత్యురహితు డగును.

ముక్తి కావలయునను వ్యక్తి తన యుత్పత్తిని గూర్చి విశేషముగ నెఱుంగుట యుక్తము. అ ట్లెఱుగుట తత్త్వజ్ఞానమునకు మూలమగును. తత్త్వజ్ఞానమువలన, దుఃఖవిముక్తి యేర్పడును. లోకమున గల యెల్ల ప్రాణులు దుఃఖవిమోచనమునకే యత్నించుచుండును. కా వు న నే యీ

యధ్యాయమునందు పురుషార్థ సాఫల్యముంగూర్చి తెలుపబడినది. గర్భాధానమునకు బూర్వమున జీవుడు పురుషదేహమున జేరి వీర్యముతో బాటు గర్భాధాన సమయమున స్త్రీదేహమున బ్రవేశించును. సుశ్రుతాది ఆయుర్వేద గ్రంథములందు గర్భధారణానంతరమున జీవుడు స్త్రీ దేహమున జేరునని వర్ణింపబడుట జూడనగును.

కొందఱు జీవుడు స్వకృత కర్మఫలముల ననుభవించుట కనుగుణముగ కొంతకాలము చంద్రాది గ్రహాంతరములందు వసించి, యటుపై వృష్ట్యాది మార్గమున భూమింజేరి, యోషధ్యాదులతో గూడి, పురుషదేహమునందు జేరి, వీర్యముతో బాటు స్త్రీగర్భాశయమున జేరుట యొకవిధము. ఈ పద్ధతిలో జీవులకు ఓషధ్యాదులతో గలుగు సంబంధము శరీరములతో గలుగు సంబంధమువంటిది కాదు. శరీరములం దున్నపుడు సుఖదుఃఖానుభవముండును. ఓషధ్యాదులలో నున్నపు డట్టి భోగప్రాప్తి యుండదని కొంద అభిప్రాయపడుచురు.

జీవులలో కొందఱు భూమిపై మరణించి మరల పృథివిపైననే జనింతురు. లోకాంతరములకు బోయి యట జన్మింపవలసిన యవసరము వారి కుండదని భావము. అట్టివారు పురుషదేహమున ముందు ప్రవేశించి, తదుపరి వీర్యముతో స్త్రీగర్భమున జేరుటయు గలదు. లేక గర్భాధానానంతరమున తిన్నగా స్త్రీగర్భమున జేరుటయు కలదు.

ఇట్లు జీవులు గర్భమున బ్రవేశించుటలో నొకే వ్యవస్థ యున్నట్లు కనిపింపదు. కాని, జీవుడు స్త్రీలగర్భాశయమున బ్రవేశింపనంతవఱకు నతనికి భోగప్రసక్తి కలుగుట కవకాశమున్నట్లు కనిపింపదు. భోగప్రసక్తి లేకయే కొంతకాలము ఓషధ్యాదుల నంటిపెట్టుకొని జీవు లుండుటకు కారణము మృగ్యము.

జీవులు సామాన్యముగ బద్ధులు ముక్తులు నని రెండు తెగలుగా నుందురు. బద్ధజీవులకు ముక్తి లభించువఱకు సుఖదుఃఖానుభూతి యుండక

తప్పదు. కావున బద్ధజీవు లొకశరీరమును విడిచి మఱియొక శరీరమును బొందుటలో కొంతవ్యవధి యుండి, యా కాలమున వారికి సుఖదుఃఖములు కలుగకుండుటకు హేతువు కనిపింపదు. ఒక దేహమును వీడి మఱియొక దేహమును బొందుటకు మధ్యలో వ్యవధి యుండవలసిన అవసర ముండ రాదు. వెంటనే దేహాంతరప్రాప్తి కలుగుట యుక్తము. గొంగడిపురుగు ఒక తృణమునుండి మఱియొకతృణము జేరునట్లు జీవు డొకదేహమును విడిచి మఱియొక దేహమున జేరుననియు జెప్పుట కలదు. ఇదియే సముచిత మేమో!

ఈయధ్యాయమున జీవునకు గలుగు మూడు జన్మములు ప్రదర్శింప బడినవి. అవి జీవుల కనేక జన్మలు కలుగు ననుటకు ఉపలక్షకములుగా నెంచవలయును. జీవుల కనేకజన్మలు కలుగు ననుట వేదసిద్ధాంతము. స్త్రీ గర్భాశయమునందు శుక్రశోణితములు కలిసినపుడు జీవుడు వాని తాదాత్మ్య మును బొందును. కావున శరీరముతో తాదాత్మ్య సంబంధముతో ప్రాదుర్భ వించుట జీవునకు ప్రథమజన్మ మగును. ఉదరమునుండి బయట పడుట ద్వితీయ జన్మము. జీవుడు వామదేవ పదముచే జెప్పబడుటయు గలదు. కావుననే మంత్రమున వామదేవ పదప్రయోగము గాననగుచున్నది. జీవుడు గర్భమునం దున్నపుడు పూర్వజన్మములను స్మరియించుట మంత్రమున సూచింపబడినది. గర్భస్థితిని విశేషముగ నెఱుగగోరువారు గర్భోపనిషత్తును పఠింతురు గాక!

ద్వితీయాధ్యాయము సమాప్తము



# తృతీయాధ్యాయము

"కోఽయ మాత్మేతి వయ ముపాస్మహే కతరః స ఆత్మా
యేన వా రూపం పశ్యతి యేన వా శబ్దం శృణోతి
యేన వా గంధా నాజిఘ్రతి యేన వా వాచం వ్యాకరోతి
యేన వా స్వాదు చాస్వాదు చ విజానాతి." ౧

అయమ్ ఆత్మా ఇతి=ఇతడు పరమేశ్వరు డని, వయం=మనము, ఉపాస్మహే=ఉపాసింపవలయునో, సః=అతడెవరు?, సః కతరః ఆత్మా= జీవ పరమాత్మలను రెండింటిలో నతడెవరు?, యేన వా=ఎవనిమూలమున, జీవుడు, రూపం పశ్యతి=రంగును గ్రహించును? - చూచును?, యేన వా శబ్దం శృణోతి? = ఎవనియునికివలన శబ్దమును చెవితో వినుచున్నాడు?, యేన వా గంధాన్ ఆజిఘ్రతి=ఎవని యునికివలన, గంధములను నాసికతో వాసనచూచును?, యేన వా వాచం వ్యాకరోతి? = ఎవని యునికివలన వాక్కును వాణితో బల్కుచున్నాడు?, యేన వా స్వాదు చ అస్వాదు చ విజానాతి=ఎవనిసత్తా మూలమున రుచులను జిహ్వతో తెలిసికొనుచున్నాడో, ఆ పరమేశ్వరు డెట్టివాడు?

ఈ యధ్యాయమునందు ఉపాస్యుడగు పరమేశ్వరుడు, ఉపాసకుడగు జీవుడు రెండు పదార్థములు స్పష్టపఱపబడినవి. మన ముపాసింపవలసిన పరమేశ్వరు డెవరు? ఎట్టివాడు? అను జిజ్ఞాసతో నీ యధ్యాయము ప్రారంభింపబడినది. జీవుడు రూపమును నేత్రముతో జూచును - తెలిసికొనును. పరమేశ్వరుడు రూపమును జీవునకు నేత్రము ద్వారమున దర్శింపజేయును. అట్లే శబ్దము, గంధము, వాక్కు, రుచి మున్నగు విషయములను పరమేశ్వరుడు జీవునకా యా యింద్రియములతో నెఱుగజేయునని గ్రహింపవలయును. పరమేశ్వరుని యునికి లేక జీవు డాయా విషయములను కేవ లేంద్రియములతో గ్రహింపజాల డని భావము.

"యదేతద్ధృదయం మనశ్చైతత్ సంజ్ఞాన మాజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం మేధా దృష్టిర్ ధృతిర్ మతిర్ మనీషా జూతిః స్మృతిః సంకల్పః క్రతుః అసుః కామో వశ ఇతి సర్వాణ్యేవైతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవంతి." ౨

యత్ ఏతత్ హృదయం=ఈ హృదయము, ఏతత్ మనః చ= ఈ హృదయమున నుండు మనస్సుకూడ, ఎవనితోగూడి కార్యములను నొనర్చునో యతడు జీవాత్ముడు. సంజ్ఞానమ్=కొండొక విషయమును బాగుగనెఱుగుట, ఆజ్ఞానమ్ = ఈశ్వరభావముతో నాజ్ఞలను పాలించుట, విజ్ఞానమ్=విశేషజ్ఞానము, ప్రజ్ఞానమ్=అతిశయజ్ఞానము, మేధా = కనిన వినిన విషయములను మఱవకుండుట, దృష్టిః=చూపు, ధృతిః = ధారణ, మతిః=మననము, మనీషా = తెలియదగిన వస్తువును బొందుటకు గల స్వాతంత్ర్యము, జూతిః=విచారణమునందలి తీవ్రత, స్మృతిః=స్మరణము, సంకల్పః=ఇదియిట్లే యనుబోధ, క్రతుః = ఇది యిట్లేచేయుదు ననునిశ్చయము, అసుః=ప్రాణనవృత్తి, కామః=అప్రాప్తవిషయమునెడ గలుగు ఉత్కంఠ, వశః=స్త్రీలు మున్నగు విషయముల వశపఱచుకొనవలయునను కోరిక, సర్వాణిఏతాని=ఇవి యన్నియు, చేతనాత్మకులింగములు. జీవాత్ముని సహకారముతో మనస్సున నుండునవియై, ప్రజ్ఞానస్య=నిరతిశయజ్ఞానరూపుడగు పరమేశ్వరునకు, నామధేయాని భవంతి=నామము లగుచున్నవి.

మనఃసంయుక్తము లగు చక్షురాదీంద్రియములతో జీవుడు రూపాదులను గ్రహించును. కాని, సూర్యాదులప్రకాశ మున్నపుడే నేత్రాదులు రూపాదులను గ్రహించుటకు సమర్థము లగును. సూర్యకాంతి లేని సమయమున గాఢాంధకారమున నే వస్తువును నేత్ర ముండియు జీవుడు గ్రహింపజాలడు. అట్లే పరమేశ్వరుని యునికి సహకారములు లేనినాడు జీవుడు మనస్సుతో గూడియుండియు నేమియు చేయజాలడు. కావుననే యిట వర్ణించిన ప్రజ్ఞానాదులు ప్రకృష్టనిరతిశయ జ్ఞానస్వరూపుడగుపరమేశ్వరుని

యునికిని దెలుపు నామములుగ నెంచబడును. సూర్యప్రకాశ సహకారముతో నేత్రము రూపమును గ్రహింప సమర్థ మగునట్లు పరమాత్మునిచే వ్యాప్తదగు జేవుదే జ్ఞానసంబద్ధములగు కార్యముల నన్నింటిని జేయునని భావము.

"ఏష బ్రహ్మైష ఇంద్ర ఏష ప్రజాపతి రేతే సర్వే దేవా ఇమాని చ పంచ మహాభూతాని పృథివీ వాయు రాకాశ ఆపో జ్యోతీం ష్యేతా నీమాని చక్షుద్రమిశ్రా ణీవ బీజా నీతరాణి చేతరాణి చాండజాని చ జారుజాని చ స్వేదజాని చోద్భిజ్జాని చాశ్వా గావః పురుషా హ స్తినో యత్ కిం చేదం ప్రాణి జంగమం చ పతత్రి చ యచ్చ స్థావరం సర్వం తత్ ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం ప్రజ్ఞానేత్రో లోకః ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ." 3

ఏషః బ్రహ్మ=ఈ బ్రాహ్మణుడు—జ్ఞానయుక్తుడు, ఏషః ఇంద్రః = ఈ క్షత్రియుడు, ప్రకృష్టక్షేత్రము గ ల వా డు, ఏషః ప్రజాపతిః = ఈ ప్రజాపోషకుడైన వైశ్యుడు, ఏతే సర్వేదేవాః = ఈ దేవతాత్మకములగు నింద్రియములు, ఇమాని పంచభూతాని చ=ఈ ప్రత్యక్షములగు పృథివి, జలము, అగ్ని, వాయువు, అకాశము నను పంచభూతములు,ఏతాని ఇమాని చక్షుద్రమిశ్రాణి ఇవ బీజాని=ఈ భూమ్యాదులందుగల పురుగులు మున్నగు అల్పప్రాణుల దేహములకు కారణములయిన భూతములు, ఇతరాణి = ఇతరములైన, అండజాని చ = అండముల నుండి పుట్టునవి, జారుజాని చ=జరాయువు (మాయ) తో జనించునవి, స్వేదజాని చ=చెమటనుండి కలుగు పేలు మున్నగునవి, ఉద్భిజ్జాని చ = భూమిని పెకలించుకొని పుట్టునవి - వనస్పత్యాదులు, అశ్వాః=గుఱ్ఱములు, గావః = గోవులు, పురుషాః=పురుషులు, హ స్తినః=ఏనుగులు, యత్ కిం చ ఇదం ప్రాణి జంగమం చ = తిరుగాడు నీ ప్రాణులు, పతత్రి చ = పక్షులు, యత్ చ స్థావరం=స్థిరముగ నుండునదియు, సర్వం తత్=అది యంతయు, ప్రజ్ఞా

నేత్రం=పరమేశ్వర నాయకత్వము కలది, ప్రజ్ఞానే ప్రతిష్ఠితమ్=పరమే శ్వరుడే ఆధారముగా గలది, పరమేశ్వరునందే సర్వము స్థిరమై యున్నదని భావము. ప్రజ్ఞానేత్రో లోకః=లోకము చితిశక్తిచేతనే నడపబడుచున్నది. ప్రజ్ఞా ప్రతిష్ఠా = చితిశక్తియే ఆ ధా ర ము. ప్రళయసమయమునందును చిద్రూపుడగు పరమేశ్వరునందే యుండునని భావము. కావున, ప్రజ్ఞానం బ్రహ్మ = నిరతిశయ జ్ఞానస్వరూపమగు నా పరమాత్మయే యన్నింటి కంటెను గొప్పది. (బ్రహ్మ=గొప్పది.)

"స ఏ తేన ప్రజ్ఞే నాత్మనాఽస్మాల్లోకా దుత్క్రమ్యా
ముష్మిన్ స్వర్గే లోకే సర్వాన్ కామా నాప్త్వా
అమృతః సమభవత్ సమభవత్ (ఇత్యోమ్) ర

ఇ త్యైతరే యారణ్యకే షష్ఠోఽధ్యాయః
ఉ ప ని ష త్సు చ తృతీయోఽధ్యాయః
స మా ప్తః

సః = ఆ జీవుడు, ఏతేన ప్రజ్ఞేన ఆత్మనా=ఈ జ్ఞానస్వరూపమగు పరమాత్మ ద్వారమున, అస్మాత్ లోకాత్ = ఈ లోకమునుండి - శరీరము నుండి, ఉత్క్రమ్య=వెలువడి, అముష్మిన్ స్వర్గేలోకే=పరోక్షమగు పరమ పదమునందు – ముక్తావస్థయందు, సర్వాన్‌కామాన్ ఆప్త్వా=సర్వకామ ములను బొంది, అమృతః సమభవత్=మృత్యురహితు డగును.

'అమృతః సమభవత్' అను నీ వాక్యము అధ్యాయ సమాప్తిని సూచించుటకు రెండు పర్యాయములు ప్రయోగింపబడినది.

ఉపాసకుడైన జీవుడు నిరతిశయ జ్ఞానస్వరూపుడగు పరమేశ్వరుని సర్వాధారుడుగ, సర్వనిమిత్తముగ నెఱింగి-సాక్షాత్కారము చేసికొని, సర్వ కామములను బొందినవాడై శరీరమును విడిచి ముక్తు డగును. పరాంత కాలమువఱకు జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ గ్రస్తుడు కాక ఆనందము ననుభవించును.

ఈ యధ్యాయమునందు ఉపాస్యోపాసక భేదముతో రెండాత్మ వర్ణింపబడుట స్పష్టముగ జూడనగును. అందువలననే యిట 'సః ప్ర నాత్మనా' అను పదములలో 'సః' పదమునకు జీవుడనియు, 'ప్రజ్ఞే నాత్మన అను పదమునకు పరమేశ్వరు డనియు అర్థము వ్రాయబడినది. కాబట్టి శరీరమున జీవేశ్వరు లను నామములతో రెండాత్మలు నుండును. నేత్రాదు బాహ్యప్రకాశ సాహాయ్యములేక తమ పనులు చేయజాలనట్లు పరమేశ్వ సత్తాసాహాయ్యములేక జీవు డేమియు చేయజాలడు. సూర్యప్రకాశము నే కార్యమున సహకరించియు నేత్రదోషముల నంటకుండునట్లు పరమేశ్వరు జీవులొనరించు కార్యములకు సాధారణ సహకారియైనను జీవు లొనర పాపపుణ్యములతో లిప్తుడు కాడు. ఇట్లీశరీరమునందు జీవేశ్వరు ల రెండాత్మలు ఉండుటలో నెట్టి యాపత్తియు నుంతదని భావము. ఇది యీ క్రింది వేదమంత్రమునందు స్పష్టము చేయబడినది.

"ద్వాసుపర్ణాసయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజా
తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్న న్నన్యో౽భిచాకశీతి

ఈ శరీర రూపవృక్షమును రెండుపక్షు లంటియుండును. అందొక వృక్షఫలముల ననుభవించును. రెండవది యనుభవింపక చూచుచుండు ప్రకాశించుచుండును.

ఐతరేయారణ్యకమున ఆఱవ అధ్యాయము,

ఉపనిషత్తునందు మూడవ అధ్యాయము.

సమాప్తము.

సకల శాస్త్ర నిష్ణాత శ్రీమత్ పండిత ముక్తి రామోపాధ్యాయ శిష్య
శ్రీ పండిత గోపదేవ విరచితాంధ్ర టీకా తాత్పర్యము
సమాప్తము.